శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# పురుషకారమ్— శిఱై యిరున్దవళ్ ఏఱ్ఱమ్

## (పురుషకారం— చెఱలో ఉన్న సీతాదేవి గొప్పతనం)



**యేరి-కాత్త రామర్, మధురాంతకం**



'పండితరత్న' డా|| ఉ.వే.ఈయుణ్ణి అఴగ శింగరాచార్యులు



శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్య స్వామి



శ్రీమాన్ శతాభిషేకమ్ గోవింద నరసింహాచార్యస్వామి

# అవతారిక

(ఇది, ఈ ద్రావిడ గ్రంథమూలాన్ని ముద్రించిన శ్రీ ఎస్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామి అనుగ్రహించిన అవతారిక)

"దేహమే ఆత్మ" అని అభిమానించేవారికి, ఆత్మస్వరూపాన్ని అర్థం చేసుకున్న ఋషులకు మధ్య పర్వత పరమాణువుల మధ్య ఉన్నంత తేడా ఉన్నది. తమ స్వప్రయత్నంతో జ్ఞానాన్ని సంపాదించిన ఋషులకు, భగవంతుని అనుగ్రహంచేత జ్ఞానాన్ని పొందినవారైన అళ్వార్లకు మధ్య అంత తేడా ఉన్నది. భగవదనుభవాన్ని ప్రధానంగా కలిగినవారైన మిగిలిన ఆళ్వారులకు, భగవంతునకు మంగళాశాసనం చేయడమే ప్రధానకృత్యంగా కలిగిన పెరియాళ్వార్లకు మధ్య అంతటి తేడా ఉన్నది. భగవంతునిలో నిష్ఠను కలిగిన పెరియాళ్వారులకు, ఆచార్య నిష్ఠను కలిగిన గోదాదేవికి మధ్య అంత తేడా ఉన్నది. వివరణ లేకపోతే పలు సందేహాలు కలిగే దివ్యప్రబంధాలను అనుగ్రహించిన ఆళ్వారులకు, ఏ సందేహం లేకుండా ఉండేటట్లు వాటికి వివరణాన్ని అనుగ్రహించిన పూర్వాచార్యులకు మధ్య అంతటి తేడా ఉన్నది. వారిలో కూడా, అనువృత్తి ప్రసన్నాచార్యులు అయిన నాథమునులు మొదలైనవారికి, కృపామాత్రప్రసన్నాచార్యులైన భగవద్రామానుజులు మొదలైనవారికి మధ్య అంతటి తేడా ఉన్నది. వారిలో కూడా, తరువాతి కాలంవారికి కూడా ఉపయోగపడేటట్లుగా గ్రంథాలను అనుగ్రహించని ఆచార్యులకు, గ్రంథాలను అనుగ్రహించిన ఆచార్యులకు మధ్య అంతటి తేడా ఉన్నది. వారిలో కూడా, వేదాంత వివరణ గ్రంథ కర్తలైన భగవద్రామానుజులు, శ్రుతప్రకాశికాచార్యులవారు మొదలైనవారికి, వేదాంతసారమైన దివ్య ప్రబంధరహస్యాది వివరణ గ్రంథాలను రచించినవారైన పిళ్ళాన్, నంజీయర్, పెరియవాచ్చాన్ పిళ్లై మొదలైనవారికి మధ్య అంత తేడా ఉన్నది. వారిలో కూడా, విశ్లేష దశలో ఈశ్వరుని, పరోపకార దశలో సంసారులను గర్హించి మాటలను పలకడం, సహజవర్ణన, " శివనాయ్ ఆయనాయ్" ( శివుడై, బ్రహ్మయై) అని అనడంవంటి సామానాధికరణ్య వచనాలు, " తాళ్ శడైయుమ్", "అరన్ నారణన్", " మూవురువుమ్ కండపోదు ఒన్డామ్ శోది", " ఆరి అయన్ అరనెన్ను మివరై ఒన్ఱ నుమ్మనత్తు వైత్తు" అని మందమతులకు భ్రమను కలిగించే మాటలు

మొదలైన క్లేశాలు నిండిన దివ్యప్రబంధాలకు వ్యాఖ్యానం అనుగ్రహించడమే ముఖ్య ముఖ్యకృత్యంగా కలిగిన పిళ్ళాన్, నంజీయర్ మొదలైనవారికి, తత్త్వ పరమైన రహస్య గ్రంథాలనే అనుగ్రహించిన శ్రీపిళ్లైలోకాచార్యులవారికి మధ్య అంతటి తేడా ఉన్నది. అర్థాన్ని తెలుసుకోవడానికి కష్టంగా ఉండే సూత్రంవంటి శైలిలో ఆవిర్భవించిన రహస్యగ్రంథాలనే అనుగ్రహించిన పిళ్లైలోకాచార్యులవారికి, వారి సూత్రాలకు విశదతమమైన శైలిలో వ్యాఖ్యానాలను అనుగ్రహించడమే ముఖ్య కృత్యంగా కలిగిన శ్రీవరవరమునులకు మధ్య అంత తేడా ఉన్నది. అందువల్లనే వీరు పూర్వాచార్యులలో చరమాచార్యులై, ప్రథమాచార్యుడైన శ్రీరంగనాథునిచే ఆచార్యులుగా వరింపబడ్డారు.

ఈ విధంగా చాలా గొప్ప వైలక్షణ్యాన్ని కలిగిన శ్రీవరవరమునుల శ్రీవచన భూషణ వ్యాఖ్యానాన్ని అనుసరించి, శ్రీవచనభూషణ మహాగ్రంథంలోని అర్థం మొత్తం కూడా సులభమైన శైలిలో ఉభయ వేదాంతాచార్య పీఠపత్రికలో దాని సంపాదకులైన ఉ. వే. శ్రీమాన్. శతాభిషేకమ్ గోవింద నరసింహాచార్యస్వామి వివరించడం ఆరంభించారు. అందులో, "శిఱై యిరున్దవళ్ ఏற்றమ్" అనే పురుషకారవైభవాన్ని వివరించే మొదటి పదమూడు సూత్రాల వ్యాఖ్యాన వివరణం ఈ గ్రంథంలో ఇవ్వబడుతున్నది.

కీర్తిమూర్తి అయిన శ్రీ. ఉ. వే. కార్పంగాడు వేంకటాచార్యస్వామి సన్నిధిలో స్వరూప గ్రంథాలను అధికరించి, స్పష్టమైన జ్ఞానాన్ని సంపాదించినవారైన ఈ స్వామి అనుగ్రహించిన వివరణ గుణాలు నిండినదై, ఏ దోషం లేనిదై ఉండడంలో ఆశ్చర్యం లేదు. స్వామియొక్క ఉపన్యాసక్రమాన్ని అనుసరించినదిగానే రచనాశైలి కూడా అమరి ఉండడాన్ని ఈ గ్రంథంలో గమనించవచ్చు. ఈ విధంగానే శ్రీవచన భూషణంలోని మిగిలిన ప్రకరణాల వ్యాఖ్యానంలోని వివరణను కూడా ఆచార్యపీఠపత్రికలోనే అనుస్యూతంగా స్వామి వివరించనున్నారు. అవి పలు గ్రంథాలుగా ప్రకటింపబడతాయి. శ్రీవైష్ణవలోకం ఈ గ్రంథాలను పఠించి, ప్రయోజనాన్ని పొందవచ్చు.

శ్రీరంగం, ఎస్ కృష్ణ స్వామి అయ్యంగార్ — సంపాదకులు,

18– 11– 1984 — శ్రీవైష్ణవ సుదర్శనమ్

# పురుషకారమ్— శిఱై యిరున్దవళ్ ఏఱ్ఱమ్

## (పురుషకారం— చెఱలో ఉన్న సీతాదేవి గొప్పతనం)

వాల్మీకి భగవానుడు బ్రహ్మ అనుగ్రహం మూలంగా తాను రచించిన శ్రీరామాయణ కావ్యానికి మూడు పేర్లు పెట్టాడు. అందులో మొదటి పేరు రామాయణం, రెండవది సీతాచరితం, మూడవది పౌలస్త్యవధం. ఈ విధంగా ఈ మూడు పేర్లను ఈ కావ్యం కలిగి ఉన్నది. ఈ మూడు పేర్లలో సీతాచరితం అనే పేరే చాలా గొప్పది— అనే విషయం "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాః చరితం మహత్" (రామాయణం అనే కావ్యం అంతా గొప్పదైన సీత యొక్క చరిత్ర )అని అన్నందు వల్ల తెలుస్తున్నది. రామాయణం సీతాచరిత్ర అయినందువల్లనే గొప్పది అని అంటే, సీతాదేవికే కదా గొప్ప మహిమ ఉండి ఉండాలి. ఆ విధంగా సీతాదేవి ఏ విధమైన గొప్పతనాన్ని కలిగి ఉన్నది? అనే విషయాన్ని తెలియాలనే ఆసక్తి వెంటనే కలుగుతున్నది. అందుచేత వ్యాసం ద్వారా పురుష కారం అనే శీర్షికలో సీతాదేవికి గల గొప్పదనం స్పష్టం చేయబడుతున్నది.

శ్రీవచనభూషణ మహాశాస్త్రంలో ఒక చూర్ణిక " ఇతిహాసశ్రేష్ఠమాన శ్రీరామాయణత్తాల్ శిఱై ఇరుందవళ్ ఏఱ్ఱమ్ శొల్లుగిఱదు" ( ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణంలో చెరలో ఉన్న సీతాదేవి గొప్పతనం చెప్పబడుతున్నది) అని ఉన్నది. ఆ చూర్ణికలో సీతాదేవి "శిఱై ఇరుందవళ్" ( చెరలో ఉన్నది) అని నిర్దేశింపబడినందున ఆమెకు అతిశయం లంకలో చెరలో ఉన్నందువల్లనే కలిగినదని స్పష్టపడుతున్నది. చెరలో ఉండడం గొప్పతనం అవుతుందా? అని అంటే, తప్పు చేసినదానికి తగిన దండనగా చెరలో ఉంటే, అప్పుడు అది తక్కువదనాన్ని కలిగిస్తుంది తప్ప, ఇతరులు మంచిని పొందడానికి కోసం తానే స్వయంగా తనను చెరలో బంధించుకోవడం అతిశయాన్ని కలిగిస్తుంది. సీతాదేవి కూడా ఆ విధంగా, ఇతరులు ఉజ్జీవించడం కోసమే

తాను లంకలో చెరలో ఉండే స్థితిని కోరి కల్పించుకున్నది— అనే విషయాన్ని ఈ క్రింది శ్లోకం వల్ల తెలియవచ్చు.

"సుందరీ రఘునాథస్య సురస్త్రీదుఃఖశాంతయే,

దశాననస్య భవనే దశ మాసానువాస హ"

అనేది ఆ శ్లోకం.

ఈ శ్లోకంలోని భావం ఏమంటే –రఘునాథుడైన శ్రీరాముని పత్ని సీతాదేవి దేవకాంతల దుఃఖాన్ని పోగొట్టడం కోసం పది తలలను కలిగినవాడైన రావణుని భవనంలో పది నెలలు చెరలో ఉన్నది –అని ఈ శ్లోకంలోని అర్థం. ఇకపై దీనిని గూర్చి కొంచెం వివరంగా గమనిద్దాం.

శ్రీపిళ్లైలోకాచార్యులవారు ఈమెను " శిఱై ఇరుందవళ్" అని నిర్దేశించడం ఈమెకు కల కారుణ్యపూర్ణ స్వభావాన్ని తెలియజేయడమే. దేవదేవుడైన భగవానునకు ముఖ్యపత్ని అయిన తన గొప్పదనాన్ని, చెరలో ఉండడం వల్ల తనకు కలిగే తక్కువదనాన్ని కూడా గమనించకుండా, దేవకాంతల కారాగారబంధాన్ని తీర్చడం కోసం తాను కారాగారంలో ఉండడం ఎందువల్ల? అంటే, ఆమె తన దయకు స్వాధీనురాలై ఉన్నందువల్లనే. అంతేకాక, బిడ్డ బావిలో పడిపోతే వెంటనే తాను కూడా బాబావిలోకి దూకి, ఆ బిడ్డను పైకి లేవ తీసే తల్లివలె, తాను అన్ని లోకాలకు సహజమైన తల్లి అయినందువల్ల ఉండే సంబంధంచేత, ఈ చేతనులు అనే తన బిడ్డలు ఈ సంసారం అనే బావిలో పడిపోతే, వీరిని ఉద్ధరించడం కోసం తాను కూడా ఈ సంసారంలోకి వచ్చి జన్మించింది. ఇందువల్ల ఈమెకు గల వాత్సల్యం బాగా వ్యక్తం అవుతున్నది.

ఈ గుణవైలక్షణ్యాన్ని ఆవిష్కరించడం కోసమే నమ్మాళ్వారులు " తనిచ్చిఱైయిల్ విళప్పుற்ற కిళిమొழியాళ్" ( అద్వితీయమైన చెరలో ప్రకాశాన్ని పొందినది, చిలుకవలె మధురంగా మాట్లాడగలిగినది అయిన సీతాదేవి) అని

అనుగ్రహించారు. దీనిని అనుసరించియే శ్రీపిళ్ళైలోకాచార్యులువారు కూడా "శిఱై ఇరుందవళ్" అని ఈమెను నిర్దేశించారు. కర్మమూలకంగా వచ్చిన కారాగారవాసమైతే, అది నైచ్యానికి కారణం అవుతుంది. సీతాదేవి బందీగా ఉండడం తనను ఆశయించిన దేవకాంతలను చెర నుండి విడిపించడంకోసం "ఇతరులు బాగుపడాలి" అనే సదభిప్రాయ రూపమైన అనుగ్రహం వల్ల, తానే కోరి స్వయంగా బందీగా తనను చేసుకొన్నది. కనుక, ఆ చెరసాలలోని వాసం ఆమెకు ఉత్కర్షనే కలిగిస్తుంది.

భగవానునుడు కూడా, జీవులవలె, తల్లి గర్భంలో వాసం చేసి జన్మించాడు. " పల పిఱప్పాయ్" అనే విధంగా ఎన్నో జన్మలను అతడు ఎత్తినప్పటికీ, ఆ జన్మల వల్ల అతనికి కాంతి కలగడం ఎందువల్ల? అని అంటే, ఆ జన్మలు కర్మమూలకంగా కాకుండా, అనుగ్రహ మూలకంగా సంభవించినవి అయినందువల్లనే. అందువల్లనే, సీతాదేవి లంకలో ఉండడం కూడా ఆమె అనుగ్రహకారణంగా సంభవించినది కనుక, అది ఆమెకు కూడా అతిశయాన్నే కలిగిస్తుంది.

సీతాదేవి తనను రావణుడు తీసికొని పోయి చెరలో పెట్టడంకోసం మాయామృగాన్ని చూచి ఆశపడి, దానిని తీసుకుని రావడం కోసం శ్రీరాముని పంపి, తరువాత తనను ఒంటరిగా విడిచి వెళ్లడానికి ఇష్టపడని లక్ష్మణుని ఉద్దేశించి పలు కఠినమైన మాటలను పలికి, అతనిని పంపి వేసి, రావణుడు తనను తీసుకొని పోవడానికి అనుకూలమైన సన్నివేశాన్ని కలిగించి, తరువాత, రావణుడు తనను తీసికొని పోయేటప్పుడు, తన సౌశీల్యం అనే అతనిని దహించకుండా చేసి, ఈ విధంగా ఇంతవరకు చేయడం అంతా తాను కావాలని కోరే చేసింది.

లంకలో ప్రవేశించిన హనుమంతుని తోకకు రావణుడు అగ్నిని ముట్టించగా, ఆ అగ్ని హనుమంతుని వాలాన్ని కాల్చకుండా ఉండడం కోసం " శీతో భవ హనుమతః " (హనుమంతునకు, అగ్నీ ! నీవు చల్లగా ఉండాలి) అనే సూక్తితో అగ్నిని చల్లగా చేసిన

సీతాదేవి, తన అనుమతి లేకుండా తనను అపహరించి తీసుకుని పోయిన రావణుని "నష్టో భవ" (నశించిపోదువుగాక!) అని శాపాన్ని ఇచ్చి నశింపజేసి, ఉండవచ్చు కదా. కానీ, ఆ విధంగా చేయలేదు. అందువల్ల సీతాదేవి తనకు స్వయంగానే బంధింపబడి ఉండే స్థితిని, ఇతరుల క్షేమం కోసం కల్పించుకున్నది. అజ్ఞులు రావణుడే బలాత్కారంగా తీసి సీతను తీసికొని పోయాడు— అని అంటారు.

శ్రీరామాయణం అంతా సీతాదేవి యొక్క అతిశయాన్నే చెప్పినట్లుగా, మహాభారతం పాండవుల కోసం దూతగా వెండిన శ్రీకృష్ణుని అతిశయాన్నే తెలుపుతున్నది. దానిని గూర్చి ఇంకొక వ్యాసంలో వివరిస్తాను.

వేదాంతాలు అనేవి జీవులు హితాన్ని పొందడం కోసం చెప్పబడిన అర్థాలను తెలుపడం కోసం ప్రవర్తించినవి. శ్రీరామాయణం, మహాభారతం వేదాంతాలలోని ఏ అర్థాలను తెలియజేశాయి?అని అంటే, సీతాదేవికి మాత్రమే చెందిన పురుషకారాన్ని పురస్కరించుకొని ఏర్పడిన సీతావైభవం, భగవానులకే తగినది అయిన అనిష్ట నివృతి— ఇష్టపాపణ రూపమైన ఉపాయంగా ఉండే స్వభావాన్ని పురస్కరించుకొని ఏర్పడిన భగవంతుని వైభవం చెప్పబడ్డాయి. అంటే, దోషపూర్ణులైన జీవులు భగవానుని ఆశ్రయించేటప్పుడు, లోకాలకు అన్నిటికీ తల్లి అయిన కారణంచేత ఏర్పడిన మాతృత్వరూప సంబంధం వల్ల, కృప మొదలైన గుణాల వల్ల, ఈమెను ఆశ్రయించడానికి మధ్యలో ఇంకొక పురుషకారమనేది (ఘటకత్వమనేది) ఆవశ్యకం కాదు. కనుక, జీవుల అపరాధాలను చూసి " న క్షమామి" ( సహించను) అనే భగవంతుని అభిప్రాయాన్ని మార్చి, చేతనులను అంగీకరించేటట్లుగా చేసే పురుషకారంలోని గొప్పతనం శ్రీరామాయణంలో, లక్ష్మీదేవి మూలంగా ఒక జీవుని భగవంతుడు అంగీకరించిన తరువాత, ఆ లక్ష్మీదేవియే ఆ చేతనుని విడచి పెట్టమని చెప్పినప్పటికీ విడువని భగవంతుని గొప్పతనం మహాభారతంలో చెప్పబడినవి.

ఈ విధంగా లక్ష్మీదేవికి —పురుషకారమై ఉండడం, భగవంతునకు — ఉపాయమై ఉండడం— అనేవి విలక్షణమైన స్వభావాలు అనేది స్పష్టంగా తెలుస్తున్నది. భగవంతుని మిగిలిన దివ్యదేవేరులకు, నిత్యసూరులైన అనంతుడు, గరుడుడు మొదలైనవారికి, భగవంతుని భక్తులకు, ఆచార్యులకు ఏర్పడే పురుషకారత్వం ఈ లక్ష్మీదేవి సంబంధం మూలంగానే ఏర్పడుతున్నది. లక్ష్మీదేవికి వలె స్వతఃసిద్ధంగా కలిగేది కాదు. అందుచేత పురుషకార స్వరూపిణి అయి ఉండడం లక్ష్మీదేవి లక్షణంగా, ఉపాయమై ఉండడం భగవంతుని లక్షణంగా అవుతున్నది. భగవానునకు పురుషకారత్వం తగదు, లక్ష్మీదేవికి ఉపాయత్వం కూడదు.

చేతనునకు భగవంతునితో, లక్ష్మీదేవితో సంబంధం సమానంగా ఉండగా, అతడు భగవంతుని ఆశ్రయించేటప్పుడు ఈ లక్ష్మీ పురుషకారం యొక్క ఆవశ్యకత ఏమున్నది? అని అంటే, తల్లి అయినందువల్ల దోషాలను గుణాలుగా గ్రహించే వాత్సల్యం అనే గుణాన్ని అధికంగా కలిగి ఉన్నప్పటికీ, భగవంతుని వలె కాఠిన్యాన్ని, మార్దవాన్ని, రెండిటిని లక్ష్మీదేవి కలిగి ఉండకుండా, కేవలం మార్దవమనే గుణాన్ని కలిగినదై, ఇతరులు కంటతడి పెడితే చూడలేని స్వభావం వల్ల భగవంతుడు ఆదరించనివారిని కూడా అతడు ఆదరించి అభిలషించేటట్లుగా చేయడానికి తగిన ప్రయత్నాన్ని చేసే స్వభావాన్ని కలిగినదై ఉన్నందువల్ల, ఎంతటి దోషాన్ని చేసినవాడైనా ఏమాత్రం వెనుకంజ వేయకుండా, జంకకుండా తన పాదాలపై పడేటట్టుగా ఈ లక్ష్మీదేవి ఉంటుంది.

పురుషుడై ఉన్నదాని వల్ల కఠినమైన స్వభావాన్ని, తండ్రి అయినందువల్ల హితాన్నే చేసే స్వభావాన్ని కలిగినవాడైన భగవానుడు చేతనుని దోషాలకు పదికి పదింతలుగా, అంటే, పూర్తిగా లెక్కబెట్టి, వాటికి తగినట్టుగా దండనను ఇచ్చేవాడు అయినందున, దోషాలను చేసినవారు అతనికి ఎదురుగా వెళ్ళడానికి చాలా భయపడేటట్లుగా అతడు ఉంటాడు. తగిన ఉపాయాలతో తనను ఆశ్రయించిన

జీవులందరి దోషాలను భగవానుడు మరచిపోయేటట్లు చేసి, అతని దగ్గరకు చేర్చేది లక్ష్మీదేవియే కనుక, అపరాధమే మూర్తీభవించిన ఈ జీవులు భగవంతుని ఆశ్రయించేటప్పుడు లక్ష్మీదేవి చేసే పురుషకారం తప్పక ఆవశ్యకం అవుతున్నది.

అందుచేతనే భగవంతుని ఆశ్రయించేటప్పుడు ఈమెను, అంటే, లక్ష్మీదేవిని, పురుషకారంగా ఆశ్రయించమని శాస్త్రం తెలియజేస్తున్నది. ఇక, లక్ష్మీదేవి యొక్క పురుషకార స్వరూపిణిగా ఉండే స్వభావాన్ని ఇపుడు వివరంగా గమనిద్దాం.

లక్ష్మీదేవి పురుషకారంగా ఉండాలి— అంటే, ఆమె కృప, పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనే గుణాలను కలిగి ఉండడం ఆవశ్యకం. కృప అంటే— దయ. అయ్యో! అని జాలి పడే స్వభావం. ఇతరుల దుఃఖాలను సహించలేని స్వభావం. పారతంత్ర్యం అంటే. పరాధీనత్వం, అంటే, ఇతరుని తనకు ప్రధానంగా కలిగి, తాను అతనికి అణగి ఉండడం. అనన్యార్హత్వం అంటే, భగవంతునకు తప్ప, ఇంకొకరికి దాసురాలుగా ఉండడానికి తగిన యోగ్యత లేకుండా ఉండే స్థితి.

లక్ష్మీదేవి పురుషకారాన్ని చేయాలి అంటే, చేతనులు సంసారంలో పడే దుఃఖాలను చూచి సహించలేక భగవంతునితో వీరిని చేర్చాలని ప్రయత్నించాలంటే కృప అనే గుణాన్ని ఆమె కలిగి ఉండాలి. స్వతంత్రుడైన భగవంతుని తన మాటలకు లోబడి ఉండేటట్లుగా ఆమె చేసేటప్పుడు, అతనిని అనుసరిస్తూ ఉండి, అతనిని తన దారికి తెచ్చుకోవాలి కనుక, పారతంత్ర్యం, అంటే, అతనిని చేరి ఉండడం అనే గుణం ఆమెకు ఉండాలి. "ఈ లక్ష్మీదేవి నాకు తప్ప ఇంకొకరికి తగనిది అయినందున, నాకే అతిశయాన్ని కలిగించేది అయినందున, ఈ జీవుని అంగీకరించమని ఈమె పలకడం నాకు చేతనలాభం అనే ఒక అతిశయాన్ని కలిగించడం కోసమే" అని భావించి, భగవంతుడు ఈమె మాట ప్రకారం చేయడానికి అనన్యార్హత్వం, అంటే, భగవంతునికి తప్ప ఇంకొకరికి తగని స్థితిని కలిగి ఉండడం— అనే స్వభావాన్ని లక్ష్మీదేవి కలిగి

ఉండాలి. అందువల్లనే, ఈ మూడు గుణాలు లక్ష్మీదేవి పురుషకారం చేయడానికి ఆమెకు తప్పక ఉండవలసినవై ఉన్నాయి.

భగవంతుని పట్ల ఈ లక్ష్మీదేవి కలిగి ఉండే పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనే ఈ గుణాలు, ఈమెకు స్వభావాన్ని బట్టి ఉండే గుణాలే కాకుండా, " హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ" ( హ్రీ అనబడే భూదేవి, లక్ష్మి నీకు పత్నులు) అని" " విష్ణుపత్నీ " (విష్ణువునకు పత్ని) అని ఉండే వేదవాక్యాలను బట్టి భగవంతునకు ఈమె పత్నియై ఉండడమనే స్వభావం వల్ల కూడా ఏర్పడతాయి.

"అహంతా బ్రహ్మణ స్తస్య సాహ మస్మి సనాతనీ" (ఎల్లప్పుడూ స్థిరంగా ఉండేదాననై, సనాతనురాలనైన నేను అహం అనే శబ్దంచేత చెప్పబడే భగవానునకు అహంతా, అంటే, " నేనై ఉండడం" అనే స్వభావంగా ఉన్నాను) అని, " శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః" ( భగవంతుడు ఎల్లప్పుడూ శ్రీవత్సం అనే పుట్టుమచ్చను వక్షస్సులో కలిగినవాడై, ఎల్లప్పుడూ లక్ష్మీదేవితో కూడి ఉండేవాడై ఉంటాడు) అని చెప్పబడే గుర్తులను బట్టి లక్ష్మీదేవికి లక్షణమైన భగవంతుని విడిచి విశ్లేషించి ఉండలేకపోవడం— అనే స్వభావాన్ని పురస్కరించుకొని, ఈ పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనే గుణాలు నిత్యంగా ఈమెకు ఉంటాయి. అందుచేతనే లక్ష్మీదేవి కంటే మిగిలినవారికి — భగవంతుడు, లక్ష్మీదేవి— అనే ఈ మిథునానికి శేషమై ఉండడం, లక్ష్మికి —భగవంతుని ఒక్కనికి మాత్రమే శేషమై ఉండడం అనేవి ఏర్పడుతున్నాయి. ఈ సహజమైన సంబంధం వల్లనే ఈమెకు, భగవంతుడు తన మాట ప్రకారం నడుచుకునేటప్పుడు మధ్యలో ఇంకొకరి పురుషకారం ఆవశ్యకం కావడం లేదు.

ఇక, కృప, పారతంత్ర్యం, అనన్యార్హత్వం— అనే ఈ మూడు గుణాలు లక్ష్మీదేవి కలిగి ఉంటుంది— అనేదానికి ఉదాహరణం చూపబడుతున్నది.

"శ్రిఞ్— సేవాయామ్" అనే ధాతువు నుండి", శ్రీః అనే పదం పుడుతున్నది. ఈ "శ్రీః" అనే పదానికి — జీవులు అందరిచే సేవింపబడేది, —అనే అర్థాన్ని గ్రహించినప్పుడు,

కృపను కలిగినది— అనే అర్థం ఏర్పడుతుంది. "భగవంతుని సేవిస్తున్నది" అనే అర్థాన్ని గ్రహించినప్పుడు, ద్వయమంత్రంలో లక్ష్మీదేవి భగవంతునితో ఎల్లప్పుడూ కలసి ఉంటుంది అనే అర్థాన్ని తెలిపే "మతుప్" అనే ప్రత్యయంలోని అర్థాన్ని పురస్కరించుకొని, ఆ భగవంతుని ఆశ్రయించి ఉండడం అనే పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనే గుణాలను కలిగినది— అనే అర్థం వ్యక్తమవుతున్నది. ఈ కృపాది గుణాలు మూడిటిని అందరూ తెలిసేటట్లుగా సీతాదేవి స్వయంగా తానే వ్యక్తం చేసిన వైభవాన్ని శ్రీరామాయణంలో ఈమెకు చెప్పబడిన మూడు విశ్లేష సందర్భాలలో మనం గమనించవచ్చు.

లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవి తన మొదటి విశ్లేషంతో తనకు గల కృప అనే గుణాన్ని వ్యక్తం చేసిన విధానం ఏమి? అని అంటే,

భగవంతుడు అవతారాలను ఎత్తినప్పుడు అంతా లక్ష్మీదేవి కూడా ఆ స్వామితో పాటుగా అవతరించి, అతనికి పత్నియై, ఆ స్వామి చేసే జగద్రక్షణకార్యంలో సహాయకురాలుగా నిలుస్తుంది. ఈ రీతిలో, భగవంతుడు దశరథచక్రవర్తికి కుమారుడై శ్రీరాముడుగా అవతరించినప్పుడు, లక్ష్మీదేవి కూడా సీతాదేవిగా జనకకులసుందరియై అవతరించింది. శ్రీరాముని వివాహమాడినది. ఆ శ్రీరాముడు దండకారణ్యానికి వెళ్లేటప్పుడు తాను కూడా అతని వెంట వెళ్ళింది. రావణుడు వియోగాన్ని కలిగించాడు—అనే నెపంతో భగవంతుడైన శ్రీ రాముని విశ్లేషించి, లంకకు వెళ్ళినది. ఈ సందర్భం" దేవ్యా కారుణ్యరూపయా "అనే రీతిలో కరుణ అనే గుణం ఈమెలో అతిశయించి ఉన్నందున, ఈమె సాక్షాత్తు దయయే అని చెప్పే రీతిలో తన కృపాగుణాన్ని వ్యక్తం చేయడం కోసమే ఈమె శ్రీరాముని విడచి లంకకు వెళ్ళింది. ఏ విధంగా? అంటే, దేవకాంతలను రావణుని చెర నుండి విడిపించడం కోసం తాను స్వయంగా లంకలో అశోకవనంలో బంధంలో ఉన్నది. ఆ స్థితిలో, ఏకాక్షి, ఏకకర్ణిక మొదలైన 700 మంది రాక్షస స్త్రీలు రాత్రి పగలు లేకుండా, ఎడతెగకుండా తనను

నిందించి, బాధించి భయాన్ని కలిగించారు. అపుడు త్రిజట అనే రాక్షసికాంత నిద్రలో, ప్రాతః కాలంలో, "రావణుడు మరణించబోతున్నాడు, శ్రీరాముడు జయాన్ని పొందబోతున్నాడు, విభీషణుడు పట్టాభిషిక్తుడు కాబోతున్నాడ"ని కలలో చూచింది. వెంటనే, ఆమె నిద్రలేచి, రాక్షస స్త్రీలను చూచి, తనకు వచ్చిన కలను గూర్చి చెప్పి, " శ్రీరాముని వద్ద నుండి మీకు శిక్ష తప్పదు సుమా! ఈ సీతాదేవిని మీరు శరణు పొందండి" అని ఉపదేశించింది. ఆమె మాటలను విన్న రాక్షసికాంతలు చాలా భయపడి వణికి పోయారు. అప్పుడు ఆ స్థితిలో వారిని చూచిన సీతాదేవి "భవేయం శరణం హి వః" ( మీకు దుఃఖం కలిగిన ఈ సందర్భంలో మీకు నేను శరణు కాగలను, మీరు భయపడకండి) అని అభయ ప్రదానం చేసింది.

ఈ మాట కేవలం మాట మాత్రమే కాకుండా, కార్యపర్యవసాయి అయినది. రావణుడు చనిపోయిన తరువాత, శ్రీరాముడు విజయాన్ని పొందిన సంగతిని సీతాదేవికి తెలుపడం కోసం ఆమె వద్దకు వచ్చిన హనుమంతుడు, అంతవరకు సీతాదేవి ఎంతగానో బాధించిన రాక్షసకాంతలను చిత్రవధ చేసి వధించాలని భావించి, అందుకు సీతాదేవి అనుజ్ఞను కోరాడు. ఆ మాటలను విన్న సీతదేవికి కన్నీటి పర్యంతంగా బాధ కలిగింది. హనుమంతుని చూచి అతనితో వాదించి, " ప్రభువును ఆశ్రయించినవారు ఆ ప్రభువు ఆజ్ఞను అనుసరించి వర్తించాలి. ఈ రాక్షసికాంతల విషయంలో ఏ దోషమూ లేదు. వీరు నన్ను బాధించడం వీరికి గుణమే అవుతుంది సుమా!" అనే వారి దోషాన్ని గుణంగా పలికి, ఆ తరువాత, "వీరు దోషం చేసినవారే కానీ. నా కంటి ఎదురుగా నీవు వీరిని బాధిస్తే, దానిని చూసి సహించగలిగినదానిని కాదు. అంతటి కాఠిన్యం నాకు లేదు" అని అన్నది. " నీ అభిప్రాయానుసారం వీరు పాపం చేసినవారే అయినా, నా అభిప్రాయాన్ని బట్టి మంచివారే అయినా, వీరి పట్ల విజ్ఞులలో గొప్పవాడివి అయిన నీవు దయను చూపడం తగినది. లోకంలో దోషం లేనివారెవరు? తన కార్యం నెరవేటట్లుగా ఇంతకాలం నన్ను చెరనుండి విడిపించకుండా ఉండడం మీ స్వామి అయిన శ్రీరాముని దోషం. అతడు చేసినట్లుగా చూస్తూ ఉండడం కాకుండా, దానిని నీ దగ్గర చెప్పడం నా దోషం. స్వామి

ఆజ్ఞను నెరవేర్చినవారిని వధించాలని భావించడమే కాకుండా, దానిని నా దగ్గర వ్యక్తం చేయడం నీ దోషం. అందుచేత వీరిని దోషులు అని భావించి దండించాలని అనుకోరాదు సుమా. ఆ విధంగా నీవు వీరిని దండించాలని అనుకున్నా, నా కోసం వీరి విషయంలో దయను చూపించాలి" అని అనేక విధాలుగా "భవేయం శరణం హి వః "అని రాక్షస స్త్రీలకు "ఆపద వచ్చినప్పుడు రక్షిస్తాను"— అని పూర్వంచేసిన ప్రతిజ్ఞకు తగినట్లుగా అపరాధం నిండిన ఆ రాక్షస స్త్రీలను హనుమంతుని బారినుండి రక్షించినందున తన కృపను వ్యక్తం చేసింది కదా.

రెండవ విశ్లేషం పారతంత్ర్యాన్ని వ్యక్తం చేయడం కోసం ఏర్పడింది. మధ్యలో ఏర్పడిన ఈ వియోగం అనేది ఎప్పుడు అంటే,

రావణుని జయించి అయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషేకాన్ని చేసుకొనే పదివేల సంవత్సరాలు శ్రీరాముడు రాజ్యాన్ని పాలించేటప్పుడు, అతనితో కలసి ఉండి అన్ని సుఖాలను శ్రీరామునితో అనుభవించిన సీతాదేవి గర్భాన్ని ధరించింది. ఆ విషయాన్ని తెలిసికొన్న శ్రీరాముడు" సీతాదేవీ! 60 వేల సంవత్సరాలు గడచినప్పటికీ సంతానం లేనందున పుత్రకామేష్టి యాగాన్ని చేసి, నన్ను పుత్రునిగా పొందిన నా తండ్రి వలె కాకుండా, పదివేల సంవత్సరాలలోనే, ఏ యాగం చేయకుండానే, నేను తండ్రిని అయ్యే భాగ్యం పొందానే!" అని చాలా సంతోషించాడు. సీతాదేవిని చూచి "నీకు ఏమి కావాలో కోరుకో" అని అన్నాడు. అప్పుడు సీతాదేవి కూడా "గంగానది తీరంలో ఉండే, పుణ్య కార్యాలనే చేస్తున్న ఋషుల తపోవనాలను నేను చూడాలని కోరుతున్నాను. కందమూలాలను భుజించే వీరి సమీపంలో ఒక రాత్రి అయినా వసించాలని ఆశపడుతున్నాను "అని తనకు కల వనవాసాభిలాషను తెలియజేసింది. అప్పుడు "రావణుని భవనంలో 10 నెలల కాలం ఉన్న సీతాదేవిని శ్రీరాముడు గమనించకుండా స్వీకరించాడు" అని ఒక అపనింద ఏర్పడినది. అందుచేత, శ్రీరాముడు కూడా సీతాదేవిని విడచి పెట్టాలని నిర్ణయించుకున్నాడు. ఆమె ఆశపడినట్లుగా తపోవనానికి

పంపించేవానివలె లక్ష్మణుని ద్వారా గంగానది తీరంలో సీతాదేవిని ఏకాంతంలో విడచి పెట్టేటట్లు చేశాడు. ఇది రెండవ సారి ఏర్పడిన వియోగం.

ఈ విశ్లేషాన్ని సీతాదేవి ఎందుకు స్వీకరించింది? అంటే, శ్రీరామునకు తాను పత్ని అయినందువల్ల శ్రీరాముడు తనను అంతఃపురంలో ఉంచినప్పుడు, అరణ్యంలో విడచి పెట్టినప్పుడు, ఏ తేడా లేకుండా, అతని అభిప్రాయాన్ని అనుసరించి ప్రవర్తించవలసిన తన పరతంత్రతను, అంటే, అతనికే పశమయి ఉండే స్థితిని, వ్యక్తం చేయడం కోసం. "ఎవరో అపనిందను పలికారు" అని శ్రీరాముడు నిన్ను విడిచి పెట్టాడు— అని లక్ష్మణుడు నిక్కిలి బాధతో సీతాదేవికి తెలియజేసినపుడే సీతాదేవి "శ్రీరాముడు —ఈమె నాకు అక్కర లేదు అన్నప్పుడే, నేను నిజంగా గంగా నదిలో పడి ప్రాణాలను విడిచి పెట్టాలి. అయినప్పటికీ, నా కడుపులో శ్రీరాముని సంతతి ఉన్నందున, నేను శ్రీరామునకు పూర్తిగా పరతంత్రమై ఉన్న దానను కనుక, ఆ స్వామికి చెందిన ఈ శరీరాన్ని పెట్టడానికి దారిని నేను వెతుకకూడదు. అందుచేత శ్రీరాముడు మళ్లీ నన్ను పిలిచి స్వీకరించేవరకు జీవించి ఉంటాను"అని తన పరతంత్రతను వ్యక్తం చేసింది. నమ్మాళ్వారులు నాయికా భావంలో "మాయుమ్ వగై అఱియేన్ పెణ్ పిఱందే" అని అనడం ఇటువంటిదే.

సీతాదేవి మొదటి వియోగంలో పది మాసాలలో పడవలసిన కష్టాన్ని అంతా పడినప్పుడు, " స్త్రీలకు పతియే దైవం. పతియే బంధువు. పతియే గతి. అందుచేత భర్త యొక్క కార్యమే ప్రాణాల కంటే గొప్పది" అని తానే పలికిన విధంగా ఈ రెండవ వియోగంలో భర్త అభిప్రాయాన్ని అనుసరించి ప్రవర్తించడమే తనకు విలక్షణమైన ధర్మం— అని భావించి అతనిపై ఆధారపడి ఉండడం— అనే పరతంత్ర బుద్ధితో వియోగంలో చాలా కాలం కష్టాలను పడుతూ వచ్చింది. ఇందుచేత ఈ స్థితిలో తన పరతంత్రతను వ్యక్తం చేసింది.

ఆ తరువాత ఏర్పడినదే మూడవ విశ్లేషం. ఈ విశ్లేషాన్ని సీతాదేవి ఎందుకు స్వీకరించింది? అని అంటే, తన అనన్యార్హతను నిరూపించడంకోసం. అది ఏవిధంగా? అంటే, శ్రీరాముడు కుశలవుల ద్వారా శ్రీరామాయణాన్ని విని ఆనందించి, వారు తన కుమారులు అని తెలియగానే, వాల్మీకి మునికి, అతని ఆశ్రమంలో ఉండే సీతాదేవికి దూతల ద్వారా " సీతాదేవి ఏ దోషం లేనిది అయినట్లయితే, ఆమె ఈ సభలోకి వచ్చి తన పవిత్రతను నిరూపించుకొనీ" అని తెలియజేశాడు. అప్పుడు సీతాదేవి వాల్మీకి భగవానుని పురస్కరించుకొని వచ్చి, ఆ గొప్ప సభలో కాషాయ వస్త్రాన్ని ధరించినదై, చేతులను జోడించి ఈ విధంగా శపథం చేసింది. " నేను శ్రీరాముని తప్ప వేరు ఎవరిని మనస్సులో కూడా తలవకుండా ఉన్నట్లయితే, ఈ భూదేవి నాకు వివరాన్ని ఇవ్వాలి. మనసుతోనూ, చేతలతోనూ, వాక్కుతోను నేను శ్రీరామునే ఆశ్రయించి ఉన్నదానను అయితే, ఈ భూదేవి నాకు చోటు ఇవ్వాలి" అని అంటూ శపథం చేసింది. వెంటనే భూమి బ్రద్దలైనది. దానిలోనుండి గొప్ప సర్పాల చేత మోయబడే, మణిమయమైన ఆసనం బయటకు వచ్చింది. అందులో భూదేవి కూర్చుని ఉన్నది. ఆమె సీతాదేవిని పిలిచి దగ్గరకు తీసుకొని, ఆ ఆసనంలో కూర్చోబెట్టుకున్నది. అందరూ చూస్తూ ఉండగానే ఆ ఆసనం భూమి లోపల వెళ్లిపోయి అంతర్ధానమైనది. ఈ విధంగా రసాతలాన్ని చేరిన సీతాదేవి పైన ఆకాశంనుండి పుష్పవర్షం కురిసింది. భూమినుండి జనక చక్రవర్తికి లభించిన సీతాదేవి ఆ భూమిలోకే అంతర్ధానమైనది. ఈ విధంగా ఈ విశ్లేషంలో సీతాదేవి తన అనన్యార్హత అనే తన ఇంకొక స్వభావాన్ని వ్యక్తం చేసింది.

ఈ విధంగా లక్ష్మీదేవి యొక్క సీతావతారంలో ఈమెకు చెప్పబడిన మూడు విశేషాలకు కారణం ఏమంటే, ఈ గుణాలు మూడింటిని వ్యక్తం చేయడం కోసమే. ఈ విధంగా కాకపోతే, కర్మకు వశం కాని ఈమెకు కర్మకు వశం అయిన వారికివలె ఈ విధంగా వియోగం కలగడానికి యోగ్యత లేదు. సీతాదేవి, తాను పురుష కారం అయ్యే స్వభావానికి ఉపయోగపడే గుణాలను, దానికి మూలమైన పురుషకారమై ఉండే స్వభావాన్ని వ్యక్తం చేయడం కోసం ఏర్పడిన అవతారమే ఈ సీతావతారం. ఈ విధంగా

జీవుల విషయంలో అనుగ్రహం చూపించడానికి కారణం అయిన కృప, భగవంతుని సమీపించి, అతడు తన మాట ప్రకారం నడచుకొనేటట్లు చేసే పరతంత్రత, అనన్యార్హతత్వం— అనే వీటిని వ్యక్తం చేసింది. కదా. కేవలం శాస్త్రాలలో "ఈమె పురుషకారం చేస్తుంది "—అనే విషయాన్ని వినడం మాత్రమే కాకుండా, ఆచరణ క్రమంలో కూడా కనిపిస్తున్నందున, తనను పురుషకారంగా ఆశ్రయించేవారికి పురుషకారంలో ఆసక్తి నమ్మకం స్థిరపరచడం కోసమే. ఈ లక్ష్మీదేవి యొక్క పురుషకారస్వభావం — ఘటకత్వం, అంటే, భగవంతుని, జీవులను కలపడం—. అనేది లక్ష్మీదేవి భగవంతునితో కలసి ఉండేటప్పుడు భగవంతుని విడచి విశ్లేషించి ఉండేటప్పుడు చక్కగా వ్యక్తం అవుతుంది. ఇది ఏ విధంగా? అంటే,

సీతాదేవి శ్రీరామునితో కలసి ఉండేటప్పుడు ఈ ఘటకత్వం, అంటే, జీవులను భగవంతుని కలిపే స్వభావం, లక్ష్మణుని పురస్కరించుకుని, కాకాసురుని పురస్కరించుకుని చక్కగా తెలియవచ్చు.

లక్ష్మణుని పురస్కరించుకొని ఏ విధంగా తెలియవచ్చును? అని అంటే,

శ్రీరాముడు సీతాదేవితో కలిసి అరణ్యాలకు వెళ్లాలని బయలుదేరినప్పుడు, లక్ష్మణుని శ్రీరాముడు అయోధ్యలోనే విడచి పెట్టి వెళ్లాలని భావించాడు. అప్పుడు ఈ విషయాన్ని గ్రహించిన లక్ష్మణుడు, తనను కూడా వనానికి తీసుకొని పోవాలని శ్రీరాముని ప్రార్థించడం కోసం ఆ శ్రీరామునకు సమీపంలో ఉండే సీతాదేవిని పురుషకారంగా చేసుకుని, ఆ స్వామిని శరణు పొంది, సీతాదేవి పురుషకారంతో తాను కోరిన అభిమతిని పొంది, శ్రీరామునితో కలసి అరణ్యాలకు వెళ్లాడు.

ఆ విధంగానే శ్రీరాముడు, సీతాదేవి లక్ష్మణునితో కలసి పంచవటి అనే చోటుకు చేరినపుడు, అక్కడ శ్రీరాముడు లక్ష్మణునితో పర్ణశాలను నిర్మించమని ఆజ్ఞాపించాడు. ఆ విధంగా చెప్పేటప్పుడు "జలసమృద్ధి, ఛాయాసమృద్ధి ఉండే, నీ కైంకర్యానికి అనుకూలమైన చోటును నీవే వెదకి చూచి, పర్ణశాలను నిర్మించు " అని అన్నాడు. ఈ

మాటలను విన్న లక్ష్మణుడు "శ్రీరాముడు నన్ను స్వతంత్రునిగా భావించి ఈ మాటలను బలుపుతున్నాడు కనుక, నన్ను తన దగ్గర నుండి దూరం చేస్తున్నాడు" అని భావించి, దగ్గరలో ఉండే సీతాదేవి పురుషకారంగా చేసికొని, శ్రీరాముని శరణు పొంది, "శ్రీరామా!ఎంతకాలం అయినప్పటికీ నేను నీకు పరతంత్రుడను. అందుచేత నీవు స్వయంగా మంచి చోటును వెదకి చూచి, " ఇక్కడ ఈ విధంగా, ఈ విధంగా పర్ణశాలను నిర్మించు" అని నన్ను నీవు ఆజ్ఞాపించాలి –అని ప్రార్థించాడు. సీతాదేవి కూడా ఆ విధంగానే పురుషకారం చేయగా లక్ష్మణుడు తన అభిమతిని పొందాడు. అందుచేత సీతాదేవి తాను శ్రీరామునితో కూడి ఉండేటప్పుడు లక్ష్మణుని పురస్కరించుకొని, తన పురుషకారస్వభావాన్ని వ్యక్తం చేయడం మనకు వ్యక్తం అవుతున్నది.

ఇక, కాకాసురుని పురస్కరించుకొని తన పురుషకారత్వాన్ని ఏ విధంగా వ్యక్తం చేసిందో గమనిద్దాం. చిత్రకూట పర్వతంలో ఒక పర్ణశాలను నిర్మించుకొని, శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు వనవాసాన్ని చేసే సమయంలో, ఒక నాడు లక్ష్మణుడు దగ్గర లేకుండా బయటకు వెళ్ళినప్పుడు, పర్ణశాలలో వాకిటిలో దర్భలతో చేసిన పడుకపైన శ్రీరాముని ఒడిలో తల పెట్టుకొని సీతాదేవి నిద్రించింది. కొంచెం సేపు అయిన తరువాత, సీతాదేవి ఒడిలో శ్రీరాముడు తలపెట్టుకొని పరుండి నిద్రించాడు. సీతాదేవి కూడా శ్రీరాముని నిద్రాకాలిక సౌందర్యాన్ని అనుభవిస్తూ ఉన్నది. ఆ సమయంలో, ఇంద్రుని కుమారుడైన జయంతుడు అనేవాడు కాకిరూపాన్ని ధరించి వచ్చి, తన ముక్కుతో సీతాదేవి స్తనాలను గాయపరచాడు. తాను కదిలితే శ్రీరామునకు నిద్రాభంగం కలుగుతుంది– అని భావించిన, అతని శయన కాలిక సౌందర్యంలో అభినివేశాన్ని పొందిన సీతాదేవి ఆ బాధను భరిస్తూ వచ్చింది. అయినప్పటికీ, ఆ కాకి చేసిన గాయం నుండి రక్తం ప్రవహించి, ఆ సీతాదేవి ఒడిలో పడుకుని ఉండే శ్రీరామునిపై పడింది. వెంటనే నిద్రనుండి లేచిన శ్రీరాముడు "ఎవడు ఐదు తలలను కలిగిన సర్పంతో ఆడుకుంటున్నాడు?" అని అతనిపై కోపించి, అతని శిరస్సును ఖండించడం కోసం బ్రహ్మాస్త్రప్రయోగాన్ని చేశాడు.

బ్రహ్మాస్త్రానికి లక్ష్యమైన అతని పరిస్థితిని చూసి జాలిపడిన సీతాదేవి ఆ బ్రహ్మాస్త్రం వెంటనే అతని తలను ఖండించకుండా ఉండేటట్లు, అతనిని వెంబడించేటట్లు నియమించింది. ఆ బ్రహ్మాస్త్రం వెంటనే అతని తలను ఖండించకుండా, అతనిని తరిమింది. కాకాసురుడు కూడా తనకు ఆశ్రయం కోసం అన్వేషిస్తూ, క్రమంగా తండ్రి, తల్లి, దేవతలు, దేవపత్నులు, ఋషులు, ఋషిపత్నులు అనే వీరందరినీ శరణు పొందాడు. అయినా, వీరందరూ, కేవలం జయంతుడు కాకుండా, మహాపాతకాన్ని చేసి, బ్రహ్మాస్త్రానికి లక్ష్యమై, అది వెంట తరిమే జయంతుడు అయినందున, శ్రీరాముని శరానికి భయపడి, ఎవరూ శరణు ఇవ్వలేదు. ఈ విధంగా ఆభాస బంధువులు బంధువులవలె మొదట కనిపిస్తారు. వీరందరి చేత విడువబడిన కాకాసురుడు తనపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించిన శ్రీరాముని దగ్గరకే వచ్చి, శరణు పొందాడు. ఏ విధంగా? అంటే, శరణుకోసం మూడు లోకాలలోనూ అనేక పర్యాయాలు చుట్టి తిరిగినప్పటికీ ఎక్కడ శరణు పొందలేక, అలసి సొలసిన కాకాసురుడు, ఇక ఎక్కడకు వెళ్లలేక, భూమిపై పడ్డాడు. సీతాదేవి అనుగ్రహంచేత కాకాసురుడు పడిన చోటు శ్రీరాముని సన్నిధి అయినది. ఆ విధంగా పడేటప్పుడు, అతని తోక ఒకవైపు, ఇంకొక వైపు తల ఉండేటట్లు పడ్డాడు. దానిని గమనించిన సీతాదేవి ఆ స్థితిని శ్రీ రాముడు చూడడానికి ముందే, ఆ కాకి తలను శ్రీరాముని వైపు తిప్పి, ఆ స్వామి పాదాలలో చేర్చినది. శ్రీరామునితో ఆమె ఇతనిని "రక్షించాలి, రక్షించాలి" అని ప్రార్థించింది. కరుణ అనే అమృతానికి సముద్రంవంటివాడైన శ్రీరాముడు కూడా ఆ కాకిని చేతితో ఎత్తి పట్టుకొని రక్షించాడు, దయతో కటాక్షించాడు— అని తెలుపుతున్నది, పద్మ పురాణం.

ఈ విధంగా భూమిపై పడిన శరణాగతుడైన కాకాసురుని శ్రీరాముడు శరణాగత రక్షకుడు కనుక, అతడు తన అభిప్రాయం ప్రకారం చంపదగినవాడు అయినప్పటికీ, కృపతో చక్కగా రక్షించాడు. అతనిపై ప్రయోగించిన బ్రహ్మాస్త్రంతో కాకాసురుని ఒక కంటిని మాత్రం పోగొట్టి, బ్రహ్మాస్త్రానికి లోటును కలిగించాడు. ఇక్కడ, కాకాసురుని శిరస్సును ఖండించవలసి ఉండగా, ఆ విధంగా ఖండించకుండా, ఒక కంటిని మాత్రం

పోగొట్టి, అతనిని ప్రాణాలతో విడచిపెట్టడమే రక్షణం అయినది. కాకాసురుని ఒక కంటిని పోగొట్టడం అనేది ఎటువంటిది? అంటే, మనకు ఒకే సమయంలో రెండు కళ్ళు కనిపించినట్లుగా కాకుండా, ఒక సమయంలో ఎడమ కన్ను కానీ, కుడి కన్ను కానీ, ఒక కన్ను మాత్రం కనిపించేటట్లుగా, ఒక కంటిని రెండు కన్నులుగా చేశాడు, శ్రీరాముడు— అనేది పెద్దల నిర్వాహం. అందుచేత, శ్రీరామునితో కలసి ఉండేటప్పుడు సీతాదేవి కాకాసురుని స్వీకరించి రక్షించేటట్లు పురుషకారం చేసింది— అనేది స్పష్టమవుతున్నది. ఈ విధంగా లక్ష్మణుని, కాకాసురుని శ్రీరాముడు అనుగ్రహించేటట్లుగా చేసినది శ్రీరామునితో సీతాదేవి కలసి ఉండే సన్నివేశంలోనే కనుక, సంశ్లేషదశలోని లక్ష్మీదేవి పురుషకారత్వం స్పష్టమైనది.

ఇక, విశ్లేషదశలో, అంటే, భగవంతుని విడచి ఉండే సమయంలో లక్ష్మీదేవి పురుషకారం చేస్తున్నది —అనేది వివరింపబడుతుంది. సీతాదేవి శ్రీరాముని విడచి పెట్టి అశోకవనంలో ఉండేటప్పుడు, చెడ్డ అభిప్రాయంతో తనకు ఎదురుగా నిలచి, ఇష్టం వచ్చిన రీతిలో ప్రలపించిన రావణుని స్థితిని చూచి జాలిపడి, " ఇతడు శ్రీరామునకు అనుకూలునిగా మారి బాగుపడనీ!" అనే అభిప్రాయంతో ఆ రావణుని ఉద్దేశించి " నీ ఊరిలో నీకు మంచిని ఉపదేశించి, నిన్ను బాగు చేసే మంచివారే లేరా? ఆ విధంగా లేదని చెప్పడానికి సాధ్యం కాదే! విభీషణుడు మొదలైనవారు ఉన్నారు కదా! లేక, నీవే వారిని మాటను వినడం లేదా? దీనిని నేను ఏ విధంగా తెలిసికొన్నాను? అంటే, చెడిపోయిన నీ బుద్ధి మంచి నడవడికను కోల్పోయినది" అని మంచిని ఉపదేశించి, రావణుని కూడా రామునితో కలపడానికి మార్గాన్ని అన్వేషించింది. ఆ విధంగానే, రావణుడు మరణించిన తరువాత, ఆ సంగతిని సీతాదేవి దగ్గర తెలియజేయడానికి హనుమంతుడు— సీతాదేవిని పది నెలల కాలం బాధించిన రాక్షస స్త్రీలను చిత్రవధ చేయాలను ప్రయత్నం చేసి, ఆ విషయాన్ని శ్రీరాముడు విజయాన్ని పొందిన మంచి వార్తను తెలియజేసినందుకు బహుమానంగా తనకు ఇవ్వాలని సీతను హనుమంతుడు కోరాడు. అప్పుడు ఆ హనుమంతుని చూసి, " విజ్ఞుడవైన నీవు వీరి విషయంలో దయను చేయాలి

సుమా" అని ఆ హనుమంతుని ఆ రాక్షస స్త్రీల విషయంలో దయను చూపించదగిన విషయాన్ని తెలియజేసి, వారి దోషాలను హనుమంతుడు మన్నించేటట్లు చేసింది. అందుచేత, సీతాదేవి శ్రీరాముని విడచి పెట్టి ఉండే సమయంలో కూడా పురుషకారాన్ని చేసింది— అనేది స్పష్టమవుతున్నది.

ఇక్కడ, రాక్షస స్త్రీలను హనుమంతుని బారినుండి రక్షించింది— అనే విషయం తెలుస్తున్నది తప్ప, పురుషకారాన్ని చేసింది— అనే స్పష్టం కావడం లేదే! అని అంటే, హనుమంతుని బలాత్కారంగా కాకుండా, మంచి మాటలతో అతడు రాక్షసుల దోషాలను సహించేటట్లు చేసినందున, భగవంతుని విశ్లేషించిన దశలో కూడా తాను తన ఉపదేశంతో చేతనులను తన వశం చేసుకుంటున్నది —అనేది స్పష్టమవుతున్నందున, ఇది కూడా పురుషకారమే అనబడుతున్నది.

శ్రీపిళ్ళైలోకాచార్యులవారే ముముక్షుప్పడి గ్రంథంలో " తిరువడియై పొఱుప్పిక్కుమవళ్ తన్ శొల్ వழியే వరుమవనై పొఱుప్పిక్క చొల్లవేండావిఱే" ( హనుమంతుని రాక్షస స్త్రీల దోషాను క్షమించేటట్లుగా చేసే లక్ష్మీదేవి, తన మాట ప్రకారం ప్రవర్తించే భగవంతుని జీవుల దోషాలను క్షమించేటట్లుగా చేస్తుంది— అని చెప్పనక్కరలేదు కదా) అని అన్నారు. అందుచేత భగవంతునితో కలిసి ఉండేటప్పుడు, విశ్లేషించి ఉండేటపుడు కూడా ఈమె పురుషకారాన్ని చేస్తుంది. భగవంతుని జీవులను కలిపే ఈమె స్వభావం వ్యక్తమవుతుంది— అనేదానికి దీనిని కూడా కలుపుకోవచ్చు.

ఈ రెండు దశలలో ఈమె ఏ విధంగా పురుష కారం చేస్తుంది? అని అంటే, భగవంతునితో కలసి ఉండేటప్పుడు ఆ స్వామిని మనసును మారుస్తుంది. భగవంతుని మనస్సును మార్చడం అంటే, జీవుని అనుగ్రహించడానికి అతడు సుముఖంగా ఉండేటట్లు చేయడం. జీవుల దోషాలను చూచి, "న క్షమామి" —వీరిని నేను క్షమించను దండిస్తాను, "క్షిపామి "—పక్కకు గెంటివేస్తాను —అని భావించే భగవంతుని

అభిప్రాయాన్ని మార్చి, తనను శరణు పొందిన జీవులను చూచి, అతడు జాలిపడి స్వీకరించే అభిప్రాయాన్ని కలిగినవానినిగా చేయడం. జీవులను సంస్కరించడం అంటే, చేయకూడని కార్యాలను చేయడమే తనకు స్వభావంగా కలిగినవాడై, అందువల్లనే భగవంతుని చూచి భయపడి దగ్గరకు రాకుండా తిరిగే జీవుని స్థితిని మార్చి, భగవంతుని శరణంగా ఆశ్రయించే అభిప్రాయాన్ని కలిగినవానినిగా చేయడం.

అందుచేత, లక్ష్మీదేవి భగవంతునితో తాను విశ్లేషించి ఉండేటప్పుడుచేసే ఉపదేశంతో జీవుడు భగవంతుని ఆశ్రయించడానికి అంగీకరిస్తాడు. జీవుడు చేసిన అపరాధాలనే చూసి, భగవంతుడు ఆ జీవుని అంగీకరించకుండా ఉండే సమయంలో, ఆ భగవంతునకు కల, ఎవరికీ ఉపయోగపడని, తన ఇష్టం వచ్చినట్లుగా ప్రవర్తించేటట్లు చేసే స్వాతంత్ర్యం– అనే స్వభావాన్ని మార్చి, భగవంతుని దగ్గర ఉండే అతని స్వాతంత్ర్య గుణంచేత అణిగి పోయి ఉండే కృప మొదలైన గుణాలను బయటకు వచ్చేటట్లు చేసి, స్వాతంత్రగుణం అణగేటట్లు చేసి, తన దగ్గరకు వచ్చి ఆశ్రయించిన జీవుని అతడు అంగీకరించేటట్లు చేయడమే భగవంతుని మనసును లక్ష్మీదేవి మార్చడం.

లక్ష్మీదేవి భగవంతుని విడచి ఉండేటప్పుడు, (భగవంతుడు తన కృపతో జీవుని అతనికి దోషాలను చూడకుండా, అతనిని స్వీకరించటానికి అంగీకరించినప్పుడు), ఈ జీవుడు తాను పూర్వం చేసిన పుణ్య పాపాలు అనే కర్మల మూలంగా భగవంతుని దగ్గరకు రావడానికి జంకి, దూరంగా ఉండేటప్పుడు, ఈ జీవుని ఈ విధమైన ప్రాతికూల్యభావాన్ని, అంటే, భగవంతుని ఆశ్రయించడంలో ఇష్టపడకుండా ఉండే స్వభావాన్ని, మార్చి అతడు భగవంతుని ఆశ్రయించటానికి ఇష్టపడేటట్లు చేసి, అతని మనసును సంస్కరించడమే జీవుని లక్ష్మీదేవి మార్చడం.

అందుచేత, ఈ విధంగా తనను ఆశ్రయించిన జీవుని అంగీకరించడానికి అడ్డుగా ఉండే భగవంతుని స్వాతంత్ర్యాన్ని మార్చి, అతడు తనను ఆశ్రయించిన జీవుని

స్వీకరించడానికి అనువుగా అతనికి కల కృప మొదలైన గుణాల ఉద్బుద్ధం అయ్యేటట్లు చేసేది, భగవంతుడు తనను అంగీకరించటానికి సిద్ధపడినవాడై వచ్చినపుడు, చేతనుడు అతనిని ఆశ్రయించడానికీ ఇష్టపడకుండా ఉండే స్వభావాన్ని మార్చి, భగవంతుని అతడు ఆశ్రయించడంలో అభిప్రాయం, అనుకూల్యం, కోరిక మొదలైనవి అతనికి కలిగేటట్లు చేసేది— లక్ష్మీదేవి— అనే విషయం లక్ష్మీదేవికి వాచకమైన " శ్రీః" అనే పదం ద్వారా లభిస్తున్నది. ఏ విధంగా? అంటే—

"శ్రు —హింసాయామ్" అనేది ఒక ధాతువు. ఆ ధాతువునుండి "శ్రీః"అనే పదం పుడుతున్నది. ఆదాతువునకు పోగొట్టడం అనేది అర్థం. అందుచేత, " శ్రీః" — లక్ష్మీదేవి భగవంతుని దగ్గర ఉండే, తనను ఆశ్రయించిన జీవుని అంగీకరించడానికి అడ్డుగా ఉన్నందున దోషంగా పరిగణింపబడే స్వాతంత్ర్యాన్ని పోగొడుతున్నది, అందుచేత "శ్రీః "అవుతున్నది. భగవంతుడు తనను స్వీకరించడానికి ఇష్టపడి వచ్చినపుడు, జీవుడు ఆ స్వామిని ఆశ్రయించకుండా ఉండడం అనే జీవునిలో ఉండే దోషాన్ని పోగొడుతున్నది, అందుచేత "శ్రీః "అవుతున్నది. ఆ విధంగానే, "శ్రు —విస్తారే" అనేది ఒక ధాతువు. ఆ ధాతువునుండి కూడా "శ్రీః" అనే పదం పుడుతున్నది. ఆ ధాతువునకు వృద్ధిచేయడం— అని అర్థం. అందుచేత, "శ్రీః"—లక్ష్మీదేవి భగవంతుడు జీవుని అంగీకరించేటట్లు చేసే కృప మొదలైన గుణాలను విస్తరింప చేస్తుంది, అందుచేత, " శ్రీః" అవుతున్నది. ఆ విధంగానే, జీవునకు, అతడు భగవంతుని తనకు శరణంగా ఆశ్రయించడానికి ఇష్టపడడం మొదలైన గుణాలను వృద్ధి చేస్తుంది, అందుచేత "శ్రీః "అనబడుతున్నది.

భగవంతుని జీవుని సంస్కరించడం ఏ విధంగా? అని అంటే, ఇద్దరినీ మార్చడం ఉపదేశంతోనే. అది ఏవిధంగా? అంటే,

భగవంతునితో కలసి ఉండేటప్పుడు లక్ష్మీదేవి ఒక జీవుని అంతకుముందే సంస్కరించి, ఆ భగవంతుని ముందు నిలిపి, "ఇతనిని మీరు అంగీకరించాలి "అని

అంటుంది. భగవంతుడు, అప్పుడు, సర్వజ్ఞుడు కనుక, తన ముందు నిలుచునే ఉండే జీవుని అన్ని విధాలయిన దోషాలను భావించి లెక్కపెట్టి, అతనిని అంగీకరించటానికి నిరాకరిస్తాడు. వెంటనే లక్ష్మీదేవి "మీరు ఈ విధంగా ఇతనిని గెంటి తలుపులు మూసివేస్తే, ఇతనికి ఇంకొక గతి ఉన్నదా! లేదు కదా! మీకు ఇతనికి మధ్య ఉండే సంబంధం గమనించినప్పటికీ కూడా, "ఉఱవేల్ నమక్కు ఇంగు ఒఴిక్క ఒఴియాదు"–( భగవంతునకు, చేతనులమైన మనకు మధ్య ఉండే సంబంధం అయితే, మాచే పోగొట్టుకోవడానికి సాధ్యం కాదు, భగవంతునిచే పోగొట్టుకోవడానికి సాధ్యం కాదు. మనం ఇద్దరం కలిసి నిర్ణయించుకొని పోగొట్టుకోవాలని అన్నా, పోగొట్టుకోవడానికి సాధ్యం కానిది, ఈ సంబంధం )అని గోదాదేవి పలికినట్లుగా, చేతనునకు, భగవంతునకు మధ్య ఉండే సంబంధం ఎవరి వల్ల పోగొట్టుకోవడానికి సాధ్యం కానిది. ఈ విధంగా ఉండే సంబంధం 9 విధాలుగా ఉంటుంది.

భగవంతుడు తండ్రి జీవుడు పుత్రుడు,

భగవంతుడు రక్షకుడు చేతనుడు రక్షింపబడేవాడు,

భగవంతుడు శేషి, కైంకర్యాన్ని స్వీకరించేవాడు, జీవుడు శేషభూతుడు కైంకర్యాన్ని చేసేవాడు.

భగవంతుడు ఆత్మ, జీవుడు శరీరం.

భగవంతుడు తెలియబడేవాడు, జీవుడు తెలుసుకునేవాడు.

భగవంతుడు స్వామి, చేతనుడు సొత్తు,

భగవంతుడు ఆధారం, అంటే, ధరించేవాడు, జీవుడు ఆధేయం, అంటే, ధరింపబడేవాడు.

భగవంతుడు భర్త, చేతనుడు భార్య

భగవంతుడు అనుభవించేవాడు, జీవుడు అనుభవింపబడేవాడు.

ఇవి ఆ తొమ్మిది సంబంధాలు.

ఈ విధంగా ఉండే సంబంధాలు ఘటశ్రాద్ధం చేసినప్పటికీ

( ఒక మట్టి కుండలో నిండుగా నీరు నింపి, బంధువులుగా ఉండేవారు రెండు పక్షాలవారి నడుమ దానిని పడవేస్తే, వారి మధ్య ఉండే సంబంధం ఇక లేకుండా పోతుంది –అనేది సంప్రదాయం. ఇదే ఘటశ్రాద్ధం) పోదు కదా. అంతేకాక, నీ సొత్తు అయిన ఈ జీవుని పొందడం స్వామివి అయిన నీకు ప్రయోజనమై ఉన్నది కదా. "ఈ జీవుడు నాకు దొరుకుతాడా, ఎప్పటికైనా!" అని కదా నీవు ఎదురు చూపులు చూస్తూ, "ఎదిర్ శూఴల్"– ఎదురు పన్నాగాన్ని చేస్తూ ఉంటావు. ("ఎదిర్ శూఴల్"– అంటే ఒకనిని పట్టుకోవాలని అనుకుంటే, అతడు పోయే చోటికి అంతటికి తాను అతనికి ఎదురుగా పోయి, అతని ముందు నిలువడం, తన అందాన్ని చూపించి వశం చేసుకోవడం, అతనితో మాట్లాడడం, అతడు తన విషయంలో ఆసక్తిని కలిగినవాడు అయ్యేటట్లు ఆశ్చర్యకరమైన కార్యాలను చేయడం మొదలైనవి. వీటిని భగవంతుని రామకృష్ణాది అవతారాలలో, అర్చావతారాలలో మనం గమనించవచ్చు) ఈ విషయాన్ని గూర్చి నీకు నేను చెప్పాలా? "నన్ను రక్షించాలి "అని కోరి, నీ దగ్గరకు వచ్చిన ఇతనిని నీవు రక్షించనప్పుడు, నీకు ఉండే సర్వరక్షకత్వం, అంటే, అందరినీ రక్షించడం అనే స్వభావం లేకుండా పోదా?" అని అంటుంది.

అప్పుడు, భగవంతుడు " చాలా కాలంగా నా ఆజ్ఞను అతిక్రమించి, నా కోపానికి లక్ష్యమై ఉండే ఇతనికి, ఇతడు చేస్తూ పోయిన అపరాధాలు తగినట్లుగా దండించకుండా, ఆ అపరాధాలను సహించడంవల్ల "అపరాధాలను చేసినవారికి దండన ఇవ్వాలి "అనే శాస్త్రంలోని నియమం పాడయిపోదా?" అని అంటాడు. అప్పుడు లక్ష్మీదేవి "ఇతనిని నీవు

రక్షించకుండా, ఇతడు చేసిన అపరాధాలకు తగినట్లుగా దండిస్తే, నీకు కల కృప మొదలైన గుణాలు లక్ష్యాన్ని పొందడం ఏ విధంగా? అవి లక్ష్యాన్ని పొందడం ఎప్పుడు సంభవిస్తుంది? అని అంటే, ఇతని నీవు అయ్యో! అని జాలిపడి, ఇతని దోషాలను ఆధారంగా చేసికొని, ఇతనిని అంగీకరించి రక్షించినప్పుడే కదా! జరుగుతుంది" అని అంటుంది.

అప్పుడు, భగవంతుడు, " ఈ జీవుడు చేసిన అపరాధాలకు తగినట్లుగా జన్మించకుండా విడచిపెడితే, శాస్త్ర నియమాలు అన్ని వ్యర్థమైపోతాయి. అంగీకరించకపోతే, నాకు కల కృప మొదలైన గుణాలు పనికిరాకుండా పోతాయి. ఇప్పుడు ఏం చేయాలి" అని మనస్సులో సందేహాన్ని పొందుతాడు. అప్పుడు లక్ష్మీదేవి "నిన్ను కాదని, ఉదాసీనంగా ఉండే జీవుల విషయంలో నీవు శాస్త్రనియమాన్ని ఉపయోగించవచ్చు. నిన్ను ఆశ్రయించి "నన్ను రక్షించాలి ", అని ప్రార్థించేవారి విషయంలో కృప మొదలైన గుణాలను ఉపయోగించవచ్చు. ఈ విధంగా శాస్త్రనియమాలు, కృప మొదలైన నీ గుణాలు, రెండు కూడా ప్రయోజనాన్ని కలిగినవి అవుతాయి. అందుచేత, నిన్ను కోరి నీ దగ్గరకు వచ్చిన, శరణాగతి చేసిన ఇతనిని రక్షించాలి" అనే ఉపదేశంతో భగవంతుని మనసును మారుస్తుంది.

ఈ విధంగా లక్ష్మీదేవి ఉపదేశం చేసే క్రమం శ్రీవచనభూషణం అనే రహస్య గ్రంథాన్ని అనుగ్రహించిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు రచించిన ఇంకొక గ్రంథం అయిన పరంద పడి అనే గ్రంథంలోను, పెరియ వాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన పరంద రహస్యం అనే గ్రంథంలోనూ గమనించవచ్చు. వాటి వివరాన్ని ఇంకొక సందర్భంలో వివరిస్తాను.

పరాశరభట్టర్ లక్ష్మీదేవియొక్క ఈ ఉపదేశక్రమాన్ని ఒక శ్లోకంలో ఈ విధంగా అనుగ్రహించారు—

" పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే

హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః,

కిమేతత్ నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః

ఉపాయైః విస్మార్య స్వజనయసి మాతా తదసి నః"

దీని అర్థాన్ని శ్రీవరవరమునులే ఈ విధంగా అనుగ్రహించారు.

"అపరాధ పరిపూర్ణులు అయిన జీవుల విషయంలో హితపరుడైన సర్వేశ్వరుని మనసు కోపాన్ని పొందగా, ఆ దశలో లక్ష్మీదేవి, "ఈ కోపానికి ఏమి కారణం? ? అని అనగా, "ఈ జీవుడు పరిపూర్ణంగా చేసిన అపరాధమే" అని అతడు బదులు పలుకగా, " ఇసుక కలసిన అన్నంలో రాళ్లను ఏరేవారు ఉంటారా? ఈ జగత్తులో తప్పు చేయనివారు ఎవరైనా ఉంటారా? " అని ఈ విధంగా తగిన ఉపాయాలో జీవుల అపరాధాలను అతడు మరచిపోయేటట్లు చేసి, జీవులను, భగవంతుని కలిపే రీతిలో అనుగ్రహించినందున ఉపదేశంతో లక్ష్మీదేవి భగవంతుని మార్చే రీతిని సంగ్రహంగా భట్టర్ అనుగ్రహించారు" అని శ్రీవరవరమునుల వివరణం.

"ఓ తల్లీ! నీ భర్త తండ్రివలె హితాన్ని చేసే క్రమంలో, దోషాలు నిండిన జీవుని విషయంలో ఒక్కొక్క సమయంలో కోపంతో కలత చెందిన మనస్సు కలవాడు అవుతాడు. అప్పుడు నీవు భగవంతుని చూచి "ఇదేమి? ఈ లోకంలో తప్పులు చేయనివారు ఉన్నారా?" అని తగిన ఉపాయాలతో భగవంతుడు జీవుల అపరాధాలను మరచిపోయేటట్టు చేసి, ఆశ్రయించినవానిని అంగీకరించి, స్వీకరించేటట్లుగా చేస్తావు. అందుచేత మాకు నీవు తల్లివి అవుతున్నావు "అనేది ఈ శ్లోకంలోని అర్థం.

పురుషకారమ్

భగవంతునితో చేరి ఉండేటప్పుడు జీవుని అనుగ్రహించేటట్లుగా, స్వీకరించేటట్లుగా సర్వేశ్వరుని మారుస్తుంది— అనే విషయాన్ని లక్ష్మీదేవియొక్క సీతావతారంలో కూడా మనం గమనించవచ్చు. ఏ విధంగా ? అంటే,

సీతాదేవి విషయంలో తీరని అపరాధాన్ని చేసి, శ్రీరాముని కోపానికి గురి అయి, అతడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి లక్ష్యమై, ఆ అస్త్రం నుండి తప్పుకోవాలని ప్రయత్నించి, శరణాన్ని అన్వేషిస్తూ తిరిగి, భూః, భువః, సువః అనే మూడు లోకాలలోను అనేక పర్యాయాలు చుట్టి తిరిగి, ఎక్కడా ఆశ్రయాన్ని పొందలేక చివరకు శ్రీరాముని దగ్గరకు వచ్చాడు, కాకాసురుడు. ఏ లోకంలోనూ, ఎవరి దగ్గర ఆశ్రయాన్ని పొందలేనందున, చివరకు శక్తి లేనివాడై, భూమి పైకి వచ్చి పడ్డాడు. సీతాదేవి కృపతో అతడు పడిన చోటు శ్రీరాముని సమక్షం అయినది. ఆ విధంగా పడినప్పుడు కూడా, కాకాసురుని తోక భాగం శ్రీరాముని కాలివైపు, తలభాగం ఆవలి వైపు పడినది. ఆ స్థితిని శ్రీరాముడు గమనించి చూడడానికి ముందే సీతాదేవి ఆ కాకాసురుని శ్రీరాముని చరణాలలో తల పడేటట్టుగా తిప్పి పెట్టి, "శరణాగతుడైన ఇతనిని నీవు రక్షించి తీరాలి" అని ప్రార్థించి అతని విషయంలో శ్రీరాముడు కలిగి ఉండే కోపాన్ని పోగొట్టి, దయను కలుగజేసింది. శ్రీరాముని చేత విడవబడిన బ్రహ్మాస్త్రానికి లక్ష్యభూతుడైన అతని తలను శ్రీరాముడు ఖండించకుండా రక్షించేటట్లు చేసింది.

ఈ అర్థం పాద్మపురాణంలో ఉండే

"ప్రాణసంశయమాపన్నం దృష్ట్వా సీతా ఽ థ మైథిలీ,

త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్"

అనే శ్లోకం ద్వారా తెలుస్తుంది ఈ లోకంలోని అర్థం ఏమంటే—

సీతాదేవి కాకాసురుని ప్రాణం పోయే స్థితిలో ఉన్నవానినిగా చూచి, దయతో భర్త అయిన శ్రీరామునితో "ఇతనిని రక్షించు! రక్షించు!" అని అన్నది.

దీనిని మణవాళ మహాములు శ్రీవచన భూషణ వ్యాఖ్యానంలో " వాచామగోచరమైన మహాపరాధాన్ని చేసిన కాకాసురుని శిరస్సును ఖండించాలని ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి ఒక లోటును కల్పించి, శ్రీరాముడు అతనిని రక్షించినది కూడా సీతాదేవి చేసిన ఉపదేశం వల్లనే— అనే విషయం పాద్మపురాణంలో చెప్పబడింది కదా "అని అన్నారు.

ఇక, లక్ష్మీదేవి భగవంతునకు దూరంగా ఉండేటప్పుడు జీవుని సంస్కరించడం అనేది ఎటువంటిది? అని అంటే,

భగవంతుని కోరకుండా, అతనికి ద్వేషించి కానీ, ఉదాసీనంగా ఉండి కానీ ప్రవర్తించే జీవుని చూసి, " నీవు చేసిన దోషాల క్రూరత్వాన్ని చూస్తే, నీకు ఎక్కడా కూడా కాలు ఊని, నిలబడే అవకాశం లేదు. భగవంతుని చూస్తే, అడ్డు లేని గొప్ప స్వాతంత్ర్యాన్ని కలిగినవాడు. కనుక, నీ దోషాలను పదికి పదిగా, అంటే, పూర్ణంగా లెక్కపెట్టి నిశ్చయించి, వాటికి తగిన ఫలాలను నీవు అనుభవించేటట్లు చేసి, నిన్ను దండించేటట్లు ఉన్నాడు. ఈ అనర్థంనుండి నువ్వు తప్పుకోవాలి అని అంటే, ఆ స్వామి శ్రీచరణాలను ఆశ్రయించి, ఆ శ్రీపాదాలలో తలను వాల్చడం తప్ప, వేరొక దారి లేదు. అతడు నేను సమీపిస్తే, అపరాధాలు నిండిన నన్ను అతడు అంగీకరిస్తాడా? నన్ను దండించడా? అని నీవు భయపడనక్కరలేదు. ఎన్ని అపరాధాలను చేసినా, తనకు అభిముఖుడు అయితే, తనను ఉద్దేశించి, తన దగ్గరకు రావాలని ఎవడైనా భావిస్తే, అంతమాత్రంతోనే అతడు చేసిన అపరాధాలను అన్నిటిని సహించడానికి, వాటిని భోగ్యంగా స్వీకరించడానికి తగిన కృప, వాత్సల్యం మొదలైన గుణాలతో నిండిననవాడు— అని లోకం అంతా కీర్తించే ప్రసిద్ధిని కల అద్వితీయుడు, అతడు. అందుచేత నీవు సుఖంగా ఉండాలి— అని అనుకుంటే, భగవంతుని ఆశ్రయించడానికి

ప్రయత్నించు" అని ఈ విధంగా ఉండే గొప్ప ఉపదేశంతో జీవుడు భగవంతునకు ఆభిముఖుడై, అతనిని ఆశ్రయించేటట్లు చేస్తుంది.

ఈ విధంగా లక్ష్మీదేవి ఉపదేశంలో జీవుని సంస్కరించడానికి ప్రయత్నం చేయడం ఎక్కడ గమనించవచ్చు? అని అంటే,

శ్రీరాముని విశ్లేషించి అశోకవనంలో బందీగా ఉన్నప్పుడు, తన దగ్గరకు వచ్చి ఇష్టం వచ్చినట్లుగా దుర్భాషలను మాట్లాడినవాడు, పాపం చేసి, దారి తప్పి ప్రవర్తించి తిరిగేవాడైన రావణుని ఉద్దేశించి, శ్రీరామునిచే తలను ఖండింపబడదగిన ఆతని స్థితిని చూచి జాలిపడి, " నీవు శ్రీరాముని ఆశ్రయించి, బ్రతికి బయటపడు" అని ఉపదేశించింది. ఏ విధంగా? అంటే,

"మిత్ర మౌపయికం కర్తుం రామః స్థానం పరీప్సతా,
వధం చానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః,
తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి"
అని సీతాదేవి రావణునకు ఉపదేశించిన శ్లోకాల వల్ల తెలియవచ్చు.

ఈ శ్లోకాలకు అర్థాన్ని గ్రహించేటప్పుడు, ఈ శ్లోకాలను నాలుగు వాక్యాలుగా విభాగం చేసి అర్థం చెప్పుకోవాలి.

"త్వయా రామో మిత్రమ్ కర్తుమ్ ఔపయికమ్" అనేది మొదటి వాక్యం. దీనికి అర్థం ఏమంటే– నీచేత రాముడు మిత్రుడుగా చేసికొనబడదగినవాడు– అని. అంటే, శ్రీరామునితో సంబంధం కలిగి ఉండడమే నీకు తగినది– అని భావం. దీనివల్ల నీకు, ఏ ప్రయోజనం భావించకుండానే, ప్రాప్తశేషియై గుణాలతో నిండిన శ్రీరామునితో సంబంధం, స్నేహం, కలిగి ఉండడం మంచిది –అని చెప్పినట్టయినది. అయితే, ఈ మాట సత్వగుణాన్ని కలిగినవాడికి రుచిస్తుంది తప్ప, రజోగుణం, తమోగుణం కలిగిన రావణునకు రుచించదు– అని భావించిన సీతాదేవి, ఆ విధంగా శ్రీరామునితో

సంబంధాన్ని కలిగి ఉండకపోతే, దీనికోసమైనా, అంటే, ఈ కారణం వల్ల అయినా నీవు శ్రీరాముని ఆశ్రయించాలి సుమా!—అని రెండవ మాటను పలుకుతున్నది. ఇక్కడ రెండవ వాక్యం ఏమంటే " స్థానం పరీప్సతా త్వయా రామః మిత్రం కర్తుమ్ ఔపయికమ్" అనేది రెండవ వాక్యం. దీనికి అర్థం ఏమంటే, " రజోగుణ తమోగుణాలనే స్వభావంగా కలిగినవాడవై, అందువల్ల, ఇతరులను బాధ పెట్టడంలోనే శ్రద్ధను కలిగినవాడివై ఉండే నీకు ఎక్కడైనా ఒక చోట నిలచి ఉండి కదా, ఇతరులను బాధించాలి. ఆ విధంగా, నీవు నిలబడానికి ఏదైనా ఒక చోటు అపేక్షించే నీవు, శ్రీరామునితో సంబంధాన్ని కలిగి ఉండాలి సుమా!" అని అర్థం.

దీని తాత్పర్యం ఏమంటే— దారిదోపిడి చేసేవారు కూడా భూమి పైన కాలు పెట్టి నిలచి కదా దారిదోపిడి చేయాలి. నీవు శ్రీరాముని ఆశ్రయించి తీరాలి. ఎందుకంటే, పర్వతాలలతో, వనాలతో, అరణ్యాలతో కూడి ఉండే ఈ భూమి విస్తృతి అంతా ఇక్ష్వాకు వంశానికి చెందినవారిదే కనుక, నాలుగు దిక్కులలో ఎక్కడైనా ఒకచోట నిలచి, ఇతరులను బాధించే నీకు, ఆ చోటు ఇక్ష్వాకువంశంలో పుట్టిన శ్రీరామునకే చెందినదై, అతనికి చెందనిది ఏదైనా ఒక చోటు అనేది లేనందు వల్ల, ఆ చోటును నీవు పొందాలంటే, శ్రీరాముని నీవు ఆశ్రయించక తప్పదు— అని భావం.

అప్పుడు, రావణుడు ఈ విధంగా అనుకుంటాడట. " అధముడుగా శత్రువు కాలిలో పడి, ప్రాణాలను దక్కించుకొని జీవించడం కంటే, ఆ శత్రువుచే వధింపబడటమే మేలు" అని అతడు భావిస్తాడట. ఆ విధంగా భావించే రావణుని ఉద్దేశించి సీతాదేవి ఈ విధంగా అంటున్నది. , " ఘోరం వధం అనిచ్ఛతా రామః మిత్రం కర్తుమ్ ఔపయికమ్" అనేది మూడవ వాక్యం. దీని భావం ఏమంటే—, శ్రీరాముని వద్ద నుండి ఘోరమైన వధను పొందాలని కోరని నీచేత శ్రీరామునితో సంబంధం పొందదగినది —అని. దీని తాత్పర్యం ఏమంటే— శ్రీరాముడు నిన్ను ఊరికే సులభంగా వదిలిపెట్టడు. చిత్రహింసను చేసి

చంపుతాడు. అతడు చిత్రవధగా నిన్ను చంపకుండా, సులువుగా చంపాలి— అని అంటే, నీవు అతనిని ఆశ్రయించి తీరాలి— అని భావం.

సీతాదేవి ఈ విధంగా ఉపదేశించినప్పటికీ రావణుడు శ్రీరాముని ఆశ్రయించనందువల్ల, శ్రీరాముడు యుద్ధంలో రావణుని చూడగానే, అతని చేతిలో ఉండే వింటినారిని ఖండించడం, విల్లును ఖండించడం, సారధిని చంపడం, గుర్రాలను చంపడం, ధ్వజాన్ని విరుగగొట్టడం, కిరీటాన్ని కింద పడగొట్టడం, భుజాలను నరకడం, శిరస్సులను అనేకమార్లు ఖండించడం, అతని కంటి ఎదురుగా అతడు పంపిన పుత్రులను, మిత్రులను, సేనాధిపతులు అందరినీ చంపడం, ఈ విధంగా రావణుని చిత్రహింస చేసి మనస్సులో భరించలేని బాధను కలిగించే చంపాడు శ్రీరాముడు)

ఈ రీతిలో సీతాదేవి ఉపదేశించగానే, రావణుడు మనసులో ఈ విధంగా భావించవచ్చు. " నేను శ్రీరాముని ఆశ్రయించినా, నేను అతని విషయంలో చేసిన దోషాలను చూచి, అతడు నన్ను స్వీకరిస్తాడా?" అని సందేహ పడవచ్చు. అప్పుడు సీతాదేవి దీనికి బదులుగా చెప్పే వాక్యమే నాలుగవ వాక్యం. "ఆసౌ పురుషర్షభః, స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః, విదితః, జీవితుమ్ ఇచ్ఛసి యది, తేన తే మైత్రీ భవతు "అనేది నాలుగవ వాక్యం. దీని భావం ఏమంటే, " ఈ శ్రీరాముడు మానవులలో గొప్పవాడు. శరణాగతి గొప్ప ధర్మం అని తెలిసినవాడు. శరణు పొందినవారి దోషాలను చూడకుండా, వాటినే భోగ్యంగా భావించేవాడు. ఈ విధంగా అందరిచేత భావింపబడేవాడు. ఇంత ఎందుకు? శత్రువు అయిన నీకు కూడా ఈ విషయం తెలుసు. నీవు జీవించాలని అనుకుంటే, అతనితో నీవు స్నేహం కలిగి ఉండడం మంచిది" అని భావం.

దీని తాత్పర్యం ఏమంటే — "ప్రాణేభ్యో ఽ పి గరీయసీ" అని ప్రాణాల కంటే గొప్పదానవు అయిన నిన్ను నేను దొంగిగిలించి, తీసుకుని వచ్చి, నీ భర్తకు హానిని

కలిగించాను. ఇటువంటి నేను ఆ శ్రీరాముని శరణు పొందితే నన్ను స్వీకరిస్తాడా? "అని నీవు భావించవద్దు. ఒకడు పూర్వం తన విషయంలో ఎంతటి అపరాధాన్ని చేసినప్పటికీ కూడా, తరువాత అతడు తనకు అభిముఖంగా వచ్చి ఆశ్రయిస్తే, అతడు అంతకు ముందు చేసిన దోషాలను చూచి కోపపడి నిరాకరించే తక్కువదనం శ్రీరామునిలో లేదు సుమా! ఎందుకంటే, అతడు పురుషోత్తముడు సుమా !మానవులలో గొప్పవాడు అని నీవు తెలుసుకో. శరణాగతి గొప్పధర్మం అనే విషయాన్ని చక్కగా తెలిసినవాడు, అతడు. తనను శరణు పొందినవారి విషయంలో ఉండే దోషాలను గమనించకుండా, ఆ దోషాలనే మంచి గుణాలుగా, భోగ్యాలుగా గ్రహించే వాత్సల్యం అనే గుణాన్ని కలిగినవాడు, శ్రీరాముడు— అనే విషయాన్ని అందరూ తెలిసేటట్లుగా ఉండే అద్వితీయుడు సుమా! నీవు బతికి బయటపడాలని అనుకుంటే, అతనితో నీవు సంబంధం కలిగి ఉండాలి సుమా!" అని రావణుని భయపెడుతూ సీతాదేవి ఉపదేశించింది.

సీతాదేవి ఈ విధంగా ఉపదేశించినప్పటికీ, రావణుడు మారకుండా ఉండడం— సీతాదేవి చేసిన ఉపదేశంలోని లోటువల్ల, దోషంవల్ల కాదు. రావణుడు చేసిన పాపంలోని ఆధిక్యమే దీనికి కారణం.

ఈ రీతిలో భగవంతునితో కలసి ఉండేటప్పుడు కాకాసురునికోసం చేసిన ఉపదేశంతో శ్రీరాముని మనసును మార్చిన విషయాన్ని పురస్కరించుకొని "భగవంతుని మనసును మారుస్తుంది" అని, శ్రీరాముని విశ్లేషించిన సమయంలో రావణుని ఉపదేశంతో అతని మనసును మార్చాలని ప్రయత్నించడాన్ని పురస్కరించుకొని "జీవుని మనసును మారుస్తుంది "అని లక్ష్మీదేవి భగవంతుని, జీవుని మనసులను మార్చడం తెలియజేయబడడంచేత, లక్ష్మీదేవిని నిర్దేశించే "శ్రీః "అనే పదం "శ్రు—శ్రవణే" అనే ధాతువు నుండి పుట్టి "శ్రావయతి ఇతి శ్రీః" అనే వ్యుత్పత్తి చేత "వినేటట్లు చేస్తుంది" అనే అర్థాన్ని చూపుతున్నది.

ఈ విధంగా "శ్రీః" అనే పదానికి ఆరు విధాలుగా అర్థాలు చెప్పబడి, లక్ష్మీదేవి యొక్క గొప్పతనం చెప్పబడినట్లయినది. ఈ ఆరు అర్థాలను ఇంతకుముందే వివరించినప్పటికీ, ఇవి మనసులో స్థిరంగా నిలవడం కోసం సంగ్రహంగా మళ్ళీ ఇక్కడ చూపబడుతున్నాయి.

"శ్రిఞ్— సేవాయామ్" అనే ధాతువునుండి "శ్రీయతే ఇతి శ్రీః" —"అందరిచే ఆశ్రయింపబడుతున్నది " అనే కర్మణి వ్యుత్పత్తి చేత " శ్రీః "అనే పదం పుట్టినప్పుడు, "జీవులు అందరిచేత ఆశ్రయింపబడుతున్నది "అనే అర్థం వస్తుంది.

" శ్రిఞ్— సేవాయామ్" అనే అదే ధాతువు నుండి "శ్రయతే ఇతి శ్రీః" —భగవంతుని ఆశ్రయిస్తున్నది —అనే కర్తరి వ్యుత్పత్తి చేత "శ్రీః" అనే పదం పుట్టినప్పుడు, " భగవంతుని ఆశ్రయిస్తున్నది "అనే అర్థం వస్తుంది.

"శ్రు — హింసాయామ్" అనే ధాతువు నుండి "దోషాన్ శృణోతి నివర్తయతి ఇతి శ్రీః"— "దోషాలను పోగొడుతున్నది" అనే వ్యుత్పత్తి చేత "శ్రీః" అనే పదం ఏర్పడినప్పుడు, జీవుల అనాది వాసన చేత భగవంతుని ద్వేషించడం అనే దోషాన్ని, భగవంతుడుతన స్వాతంత్రం చేత చేతనుల దోషాలను చూచి దండించే స్థితి అనే దోషాన్ని పోగొడుతున్నది —అనే అర్థం వస్తుంది.

" శ్రూ— విస్తారే "అనే ధాతువునుండి "శ్రూణాతి విస్తారయతి గుణైః ఇతి శ్రీః" — గుణాలతో నిండినవానిని చేస్తున్నది— అనే వ్యుత్పత్తి చేత "శ్రీః "అనే పదం పుట్టినప్పుడు, చేతనుని —భగవంతుని ఆశ్రయించటానికి కావలసిన ఆశ మొదలైన గుణాలతో నిండినవానినిగా చేస్తున్నది— అని, భగవంతుని— చేతనుని స్వీకరించడానికి మూలమైన కృప మొదలైన గుణాలతో నిండినవానినిగా చేస్తున్నది —అని అర్థం వస్తుంది.

పురుషకారమ్

" శ్రు— శ్రవణే" అనే ధాతువు నుండి "శృణోతి ఇతి శ్రీః"— వింటున్నది— అనే కర్తరివ్యుత్పత్తితో " శ్రీః "అనే పదం పుట్టినప్పుడు, "తనను ఆశ్రయించినవారి ప్రార్ధనలను వింటున్నది" అనే అర్థం వస్తుంది.

" శ్రు— శ్రవణే" అనే అదే ధాతువునుండి "శ్రావయతి ఇతి శ్రీః" — వినిపిస్తున్నది —అనే కర్మణివ్యుత్పత్తితో " శ్రీః "అనే పదం పుట్టినప్పుడు, "చేతనుని, భగవంతుని ఉపదేశశంతో తన మాట వినేటట్టు చేస్తున్నది" —అనే అర్థం వస్తుంది.

ఈ విధంగా ఆరు అర్థాలు "శ్రీః" అనే పదానికి ఏర్పడుతున్నాయి.

లక్ష్మీదేవి ఈ విధంగా భగవంతునకు, జీవులకు వారివారికి తగినట్లు ఉపదేశం చేయడం వల్ల, జీవులచేత పొందబడే ప్రయోజనం ఏమంటే, తాను చేసి పేర్చి పెట్టుకున్న పుణ్యపాపకర్మలకు వశమై ఉండడం —అనేది తొలగిపోతుంది.

భగవంతుని చేత పొందబడే ప్రయోజనం ఏమంటే— జీవులు చేసిన కర్మలకు వశమై ఉండడం అనే స్థితి తొలగిపోవడమే. అంటే—మంచి చెడ్డలను వివేకించి తెలుసుకోగలిగిన చేతనుడు, పెద్దలు శాస్త్రాల మూలంగా చాలా స్పష్టంగా చేసే ఉపదేశాలతోను, భగవంతుని రామకృష్ణాది అవతారకాలాలలో అతడు వ్యక్తం చేసిన అందం, గుణాలు, లీలలు అనే వీటిని దర్శించి, విని, " పిన్నానార్ వణంగుమ్ శోది" ( తరువాతి కాలం వారు కొలిచే జ్యోతి) అని కీర్తింపబడే అర్చావతారంలో భగవంతుని తిరుమేని అమరి ఉండే స్థితిలో వ్యక్తం అవుతున్న పరత్వ గుణాలను, సౌలభ్య గుణాలను దర్శించి, ఆయా దివ్యదేశాలలో ఉండే అర్చామూర్తులకు చాలా కాలంగా జరుపబడుతున్న మహోత్సవాలను చూచి, ఇటువంటి గొప్పతనాలు ఏమీ లేని ఇతర దేవతల దగ్గరకు వెళ్లకుండా, స్త్రీలు పురుషులు అనే తేడా లేకుండా అందరూ కూడా శ్రియః పతి అయిన భగవంతునే ఆశ్రయించాలి. అయితే, లోకంలో చాలా మంది ఇతర దేవతల దగ్గరకు వెళ్లేవారై, భగవంతుని కీర్తించకుండా, పలువురు నాస్తికులుగాను తిరుగడానికి కారణం —వారు చేసిన పాపాధిక్యమే. అందుచేత, జీవులు తాను చేసి

అర్జించుకున్న పాపకర్మలకు వశమైన వారై భగవంతుని సమీపానికి కూడా రావడం లేదు. లక్ష్మీదేవి వారికి ఉపదేశం చేయడం వల్ల ఆ ఉపదేశాన్ని ఆలకించిన చేతనులు తమ కర్మలకు వశమై ఉండడం అనేది వారికి తొలగిపోతుంది. ఇదే లక్ష్మీదేవి చేసే ఉపదేశం చేత చేతనుల కర్మలు నశించి పోవడం.

లక్ష్మీదేవి చేసే ఉపదేశంతో భగవంతుడు చేతనుల కర్మలకు వశమై ఉండడం అనేది తొలగిపోవడం— అనేది ఏమి? అంటే, భగవంతునకు, తాను చేసే సత్కర్మ, దుష్కర్మ అనే పుణ్యపాపాల రూపాన్ని పొందిన కర్మలు అనేవి ఏవీ లేవు. అందుచేత వాటి మూలంగా భగవంతుడు సుఖదుఃఖాలను అనుభవించవలసిన ఆవశ్యకత లేదు అయినప్పటికీ, జీవులు చేసిన సత్కర్మ, దుష్కర్మలు అనే పుణ్య పాపాలే రూపంగా కలిగిన కర్మలు ప్రధానంగా గ్రహించి వాటికి అనుగుణంగానే చేతనులను నిర్వహిస్తాను— అనే ఒక నిశ్చయం భగవంతునికు ఉన్నది. అది, అతడు అందరికీ సామాన్యంగా ఉండడం —అనే మధ్యస్థస్థితి వల్ల ఏర్పడుతుంది. దాని మూలంగా జీవులను పుణ్య పాపాలు అనే కర్మల నుండి విడిపించి రక్షించకుండా, ఆ కర్మలకే తాను వశమై ఉంటాడు. వాటికి అనుగుణంగానే వర్తిస్తాడు. ఇదే —భగవంతునకు కర్మపారతంత్ర్యం ఉన్నది —అనేది. ఇది లక్ష్మీదేవియొక్క ఉపదేశం చేత తీరిపోతుంది.

జీవులు తాము చేసి పెట్టుకున్న కర్మలకు వశమై ఉండడం ఎందువలన? అంటే— చాలా కాలంగా శరీరంతో ఏర్పడిన సంబంధం చేత కలిగిన అజ్ఞానం వల్లనే. భగవంతుడు చేతనుల కర్మలకు వశమై ఉండడం ఎందువలన? అంటే— ఏ అడ్డు లేని తన స్వాతంత్ర్యం కారణంగా ఏర్పడిన సంకల్పం వలన. సంకల్పం అంటే— స్థిరమైన భావన. ఈ విధంగా చేతనులు చాలా కాలంగా తాము చేసిన కర్మలకు వశమై ఉండేవారై, భగవంతుని ఆశ్రయించకుండా అతనిని గర్హించేవారై ఉండడం వల్ల, లక్ష్మీదేవి అందరికీ తల్లియై, ఆ సంబంధం కారణంగా అందరికీ మంచినే అన్వేషించేదై ఉన్నందువల్ల, ఈమె ఉపదేశం చేత దానిని విన్న జీవుల మనసు మెత్తబడి, భగవంతుని విషయంలో తాము

కలిగి ఉండే ప్రతికూలమైన భావన తొలగి, భగవంతుని ఆశ్రయించడానికి వారు అంగీకరించవచ్చు. ఆ విధంగానే, తన స్వాతంత్ర్యంతో జీవుల కర్మల మూలంగా వారిని దండించడమే స్వభావంగా కలిగినవాడైన భగవంతుడు కూడా తన పత్నియై, తనకు మిక్కిలి ప్రియమైనదై ఉండే లక్ష్మీదేవి చేసే ఉపదేశం మూలంగా కృప మొదలైనవి ఉద్బుద్ధం కాగా, తనకు కల స్వాతంత్ర్యం అణగి, దాని మూలంగా చేతనకర్మపారతంత్ర్యం తొలగి, చేతనులను అంగీకరించడానికి సిద్ధపడవచ్చు.

ఇక, ఇక్కడ ఒక ప్రశ్న వస్తుంది. అది ఏమంటే, చేతనులను మార్చడం కోసం లక్ష్మీదేవి ఉపదేశించినప్పటికీ, చాలా కాలంగా "యాదానుమ్ పఱ్ఱి నీంగుమ్ విరతమ్" ( ఏదో ఒక దానిని ఆధారంగా చేసుకుని భగవంతునకు దూరం కావడం అనే వ్రతాన్ని కలిగిన) అనే విధంగా ఏదో ఒక దానిని పట్టుకొని భగవంతుని విడిచిపెట్టే అభిప్రాయాన్ని కలిగినవాడు చేతనుడు అవుతున్నాడు. దాని మూలంగా భగవంతుని తప్ప మిగిలిన విషయలైన స్త్రీలు, అన్నం, పానం మొదలైన వాటిలో ఆశ కలిగినవాడు అవుతున్నాడు. జీవుని ఈ విధమైన చెడ్డ అలవాట్లు లక్ష్మీదేవి చేసే ఉపదేశం అనుసారం ఇతడు వర్తించడానికి అనుమతించవు, అవకాశాన్ని ఇవ్వవు. అందుచేత, ఇతడు తన కర్మకు వశమై ఉన్నవాడై, తన పూర్వవర్తనంనుండి నివర్తించడు కదా. ఆ విధంగానే, భగవంతుడు కూడా, " లక్ష్మీదేవి "చేతనుని అంగీకరించాలి" అని ఉపదేశించినప్పటికీ, చేతనుడు ఇంతకు ముందు చేసిన అపరాధాలకు తగినట్లుగా, ఆ చేతనుడు తనను శరణు పొందినవాడే అయినా, " ఇతనిని దండించాలి" అనే స్థిరమైన అభిప్రాయంతో జాలి లేనివాడై, ఏ అడ్డు లేని తన స్వాతంత్రంతో లక్ష్మీదేవి చేసే ఉపదేశాలను వినకుండా, జీవుల కర్మలకు వశమై ఉండడం అనే స్థితి నుండి నివర్తించకుండా ఉంటే ఏమి చేయాలి? లక్ష్మీదేవి భగవంతునకు పరతంత్రురాలు కనుక, భగవంతుని నియమించి కార్యం సఫలం చేయలేదు కదా!— అనేది ఇక్కడ ప్రశ్న. దీనికి సమాధానం వినండి.

తన ఉపదేశాన్ని విన్నా, తాను చేసిన కర్మలనుండి ఏమాత్రం నివర్తించని జీవుని లక్ష్మీదేవి తన అనుగ్రహంతో మారుస్తుంది. ఏ విధంగా? అంటే, " అయ్యో! ఇతడు ఈ విధంగా బాధపడుతున్నాడే! ఇతని చెడ్డ బుద్ధి తొలగి, " మనకు భగవంతుడు కావాలి"— అనే మంచి అభిప్రాయం ఇతనికి కలగాలి" అని జీవుని విషయంలో లక్ష్మీదేవి పరమకృపను చూపిస్తుంది. అందుచేత, జీవుని పాపమే చేసే చెడ్డ బుద్ధి తొలగి, అతడు కూడా భగవంతుని ఆశ పడతాడట. లక్ష్మీదేవియొక్క ఈ కృప నమ్మాళ్వారులచే " పంగయత్తాళ్ తిరువరుళ్" అని విశేషంగా స్తుతించబడింది. పరమకృప అంటే, తనను ఇంకొకరు ప్రేరేపించవలసిన అక్కర లేకుండా, భగవంతుని కృపను ప్రేరేపించే కృపయే. ఇది కేవలం లక్ష్మీదేవికి మాత్రమే ఉన్న ఒక వైలక్షణ్యం. అది ఏమంటే, " ఈ జీవుడు మంచివాడు కావాలి, ఇతడు భగవంతుని ఆశ్రయించాలి"— అని లక్ష్మీదేవి భావించడం. ఈ రీతిలో లక్ష్మీదేవి సంకల్పిస్తే, అది ఏ విధంగా ఫలిస్తుంది ? అని అంటే, లక్ష్మీదేవి విషయంలో పిచ్చెక్కి ఉండే భగవంతుడు తాను సత్యసంకల్పుడు కనుక, తాను సంకల్పించినది ఏదైనా, అది అంతా ఫలించే శక్తిని కలిగినవాడు కనుక, ఆ లక్ష్మీదేవి సంకల్పాన్ని సఫలం చేసి తీరుతాడు. అందుచేత, ఈ లక్ష్మీదేవి ఈ విధంగా సంకల్పిస్తే చేతనుడు కూడా తప్పక సంస్కరింపబడతాడు.

ఈ విధంగానే, తన ఉపదేశాన్ని విని మారని భగవంతుని తన అందంతో లక్ష్మీదేవి మారుస్తుంది. ఏ విధంగా ?అంటే, లక్ష్మీదేవి ఒక చేతనుని ఉపదేశంతో కానీ, తన పరమ కృపతో కాని మార్చి, భగవంతుని ఆశ్రయించేటట్లు చేసి, ఆ భగవంతుని సంబోధిస్తూ ", నీవు శరణు పొందిన ఇతనిని అంగీకరించాలి" అని అంటుంది. అప్పుడు భగవంతుడు తన స్వాతంత్ర్యం తల ఎత్తగా, " సరేలే, పో. అపరాధాలు నిండిన ఒకనిని తీసుకొని వచ్చి, నా కాలిలో పడవేసి, " ఇతనిని నీవు అంగీకరించాలి" అనేది ఇదే నీకు పనిగా ఉన్నదే!" అని లక్ష్మీదేవి ఉపదేశాన్ని లెక్కపెట్టకపోయినవాడే అయితే, అప్పుడు అతనిని తనకు వశం చేసుకోవడం కోసం భగవంతుని చూచి తన కళ్ళను అందంగా తిప్పుతున్నదై, తన కంచుకాన్ని సడలించుకొంటుందట. భగవంతుడు పరమ రసికుడు

కనుక, లక్ష్మీదేవి చూసే అందమైన చూపులకు, ఆ విలాసాలకు వశపడి, ఆమె విషయంలో మోహపడి తీరుతాడు. భగవంతుడు లక్ష్మీదేవి కటాక్షాలకు వశం అవుతాడు— అనే విషయం "న జీవేయం క్షణమపి వినా తా మసితేక్షణామ్" ( అందమైన నల్లని కన్నులను కలిగిన ఆ సీతాదేవి లేకుండా నేను ఒక్క క్షణం కూడా బతుకలేను) అనే ప్రసిద్ధమైన సూక్తి వల్ల తెలియవచ్చు.

అది ఏమంటే, హనుమంతుడు లంకకు వెళ్ళి, సీతాదేవిని సేవించి, శ్రీరాముని సమాచారాన్ని ఆమెకు తెలియజేసి, ఆమెను ఓదార్చి, ఆమె దగ్గర నుండి శ్రీరామునకు క్షేమసమాచారాన్ని తీసుకొని వచ్చాడు. అతడు శ్రీరామునకు సీతాదేవి సమాచారాన్ని ఈ విధంగా విజ్ఞాపన చేస్తున్నాడు. "నేను ఇంకా ఒక మాసం మించి బ్రతుకలేను. అంతలోగా శ్రీరాముడు వచ్చి నన్ను చెర నుండి విడిపించాలి— అని సీతాదేవి అన్నది" —అని హనుమంతుడు అన్నాడు. ఈ మాటలను విన్న శ్రీరాముడు, " నన్ను విడచి ఉండే సీతాదేవి "ఇంకా ఒక నెల కాలం బ్రతికి ఉంటాను" అని అన్నందున, సీతాదేవి నన్ను విశ్లేషించి, ఇంక ఎంత కాలం అయినా జీవించి ఉండగలదు. ఆమెకు నాశనం లేదు. ఒక మాసం కాలం ఆమెను జీవించి ఉండగల్గడం " నేను వస్తాను, చెరనుండి విడిపిస్తాను" అనే ప్రత్యాశ వల్లనే. అదే ఆమెను చిరకాలం సహించేటట్టు చేసి, బ్రతకగలిగేటట్లు చేస్తుంది. నేను ఆ విధంగా కాదు. నల్లని, అందమైన నేత్రాలు కలిగిన ఆ సీతాదేవిని దూరమై ఒక క్షణకాలం కూడా జీవించి ఉండలేను" అని అన్నాడు. సౌందర్యంలో తక్కువవాడనైన నన్ను విడచి ఉన్నందున సీతాదేవి చిరకాలం జీవించి ఉండవచ్చు. కాని, అందంలో అతిశయించి ఉండే సీతాదేవిని విశ్లేషించిన నేను ఒక్క క్షణం కూడా జీవించి ఉండగలగడం సాధ్యం కాదు— అనేది ఇక్కడ స్పష్టమవుతుంది. లక్ష్మీదేవికి భగవంతుని కంటే అతిశయించిన అందం ఉండడం అనేది ఆమె నేత్రసౌందర్యాన్ని పురస్కరించుకునే.

తిరుమంగై ఆళ్వారులు కూడా " వణ్డమర్ పూమా మలర్ మంగై మణనోక్కముండానే" ( తుమ్మెదలు నిండుగా ఉండే గొప్ప పూలను కలిగిన లక్ష్మీదేవి

యొక్క పరిమళభరితమైన కటాక్షాలను ఆస్వాదించినవాడు, భగవంతుడు) అని అన్నారు కదా. అందుచేత భగవంతుడు లక్ష్మీదేవి యొక్క నేత్రసౌందర్యానికి జితుడు అవుతాడు కనుక, ఆమె అతనిని తన మాట ప్రకారం నడుచుకునేటట్లు చేయగలిగిన రీతిలో తన కనులను తిప్పితే ఆ నేత్రసౌందర్యానికి ఓడిపోయి, అతడు, ఆమె చెప్పిన రీతిలో నడుచుకొని తీరుతాడు.

ఆ విధంగానే లక్ష్మీదేవి తన కంచుకాన్ని సవరించుకున్నా భగవంతుడు పిచ్చెక్కినట్లు అవుతాడు. సీతాదేవిని శ్రీరాముడు విశ్లేషించినప్పుడు శ్రీరాముడు పలికిన మాట ఇది– " తౌ తస్యా స్సహితౌ పీనౌ స్తనౌ తాలఫలోపమౌ, కదా ను ఖలు సోత్కంపౌ హసంత్యా మాం భజిష్యతః". ( చిరునవ్వు నవ్వే సీతాదేవి యొక్క, అప్పుడు, అటు ఇటు కదలాడేవి, బాగా బలిసినవై, తాటి పండ్లతో సమానంగా ఉండేవి, ఒకదానితో ఇంకొకటి పోలి ఉన్నవి అయిన స్తనాలను ఎప్పుడు నేను ఆలింగనం చేసికొంటాను?)

" పేయాళ్వార్లు కూడా "మలరాళ్ తనత్తుళ్ళాన్" ( లక్ష్మీదేవి స్తనాలలో ఉంటాడు) అని భగవంతుని నివాసస్థలంగా లక్ష్మీదేవి యొక్క స్తనాలను పలికారు. అందుచేత లక్ష్మీదేవి తన కంచుకాన్ని సవరించుకుంటే, కూడా భగవంతుడు తన మనస్సును ఆ సౌందర్యాన్ని పోగొట్టుకొని, ఆమెకు వశపడి తీరుతాడు.

ఈ రీతిలో తన అందంతో "పిత్తర్ పనిములర్ మేల్ పావైక్కు" ( చల్లని తామర పువ్వులు ఉద్భవించిన లక్ష్మీదేవి విషయంలో వ్యామోహాన్ని కలవాడు) అని చెప్పినట్లుగా భగవంతునకు అంతు లేని వ్యామోహాన్ని కలిగించి, తాను చెపి న ప్రీతిలో చేస్తే తప్ప నిలువ లేని విధంగా ఆ భగవంతుని చేసి, తనచేత సంస్కరింపబడి, భగవంతుని చరణాలను ఆశ్రయించిన జీవుని ఆ భగవంతుడు స్వీకరించేటట్లుగా చేస్తుంది, లక్ష్మీదేవి. ఇదే తన అందంతో భగవంతుని మనసును లక్ష్మీదేవి మార్చడం అంటే. అందువల్ల లక్ష్మీదేవి చేసే పురుషకారం అనేది ఏ సమయంలోనూ వ్యర్థం కాదు.

పురుషకారమ్

పురుషకారం అనే పదానికి లక్షణ ప్రక్రియలో వివరణ చేసేటప్పుడు, " పురుషం కరోతి ఇతి పురుషకారః "అనే అర్థం వస్తుంది. భగవంతుని పురుషునిగా చేస్తున్నది, జీవుని పురుషునిగా చేస్తున్నది— అనే అర్థం దీనివల్ల వస్తున్నది.

భగవంతుని పురుషునిగా చేయడం అంటే, గుణాలతో నిండినవానినిగా చేయడం. "పురు —పాలన పూరణయోః" అనే ధాతువు నుండి పూరణం అనే అర్థంలో పురుషశబ్దం పుట్టినప్పుడు, "పూర్ణత్వాత్ పురుషః "అనే నిరుక్తి చేత, "నిండి ఉన్నవాడు కనుక పురుషుడు" అని పురుష శబ్దం పుట్టేటప్పుడు, భగవంతుని క్షమ మొదలైన గుణాలతో నిండినవానినిగా లక్ష్మీదేవి చేస్తున్నది— అనే అర్థం ఇక్కడ స్పష్టమవుతున్నది.

"పుర—పాలన పూరణయోః" అనే ధాతువు నుండి పాలనమ్ అనే అర్థంలో పురుష బ్దం పుట్టినప్పుడు, పురుషుడు— పాలనంచేసేవాడు, రక్షించేవాడు —అనే అర్థం వస్తుంది కనుక, లక్ష్మీదేవి భగవానుని పురుషునిగా చేస్తుంది —అని అంటే, జీవుని అతడు రక్షించేవానినిగా చేస్తున్నది— అనే అర్థం స్పష్టమవుతున్నది.

పురు సనోతి ఇతి పురుషః" అనే ధాతువు నుండి పురుష శబ్దం ఉత్పన్నం అయినప్పుడు, నిండుగా, పూర్ణంగా ఇచ్చేవాడు పురుషుడు అవుతున్నాడు. లక్ష్మీదేవి భగవానుని, తనను ఆశ్రయించినవానికి నిండుగా ఇచ్చేవానినిగా చేస్తున్నది— అనే అర్థం ఇక్కడ స్పష్టమవుతున్నది.

ఈ విధంగా భగవంతుని లక్ష్మీదేవి పురుషునిగా చేయడం అంటే— క్షమ మొదలైన గుణాలతో నిండి ఉండేవానినిగా చేయడం. రక్షకునిగా చేయడం, మోక్ష పర్యంతంగా ఉండే పురుషార్థాలను ఇచ్చేవానినిగా చేయడం— అని మూడు విధాలుగా అర్థం వస్తున్నది. ఈ మూడు అర్థాలు పురుషకారం అనే పదానికి లభిస్తున్నవి. ఇది లక్ష్మీదేవి భగవంతునితో చేరి ఉండేటప్పుడు తన ఉపదేశంతో కానీ, తన అందంతో కానీ అతన్ని పురుషునిగా చేయడమే.

పురుషకారమ్

ఇక, జీవుని లక్ష్మీదేవి పురుషునిగా చేయడం అంటే ఏమి? అనే విషయాన్ని గమనిద్దాం. "పురు— అగ్రగమనే" అనేది ఒక ధాతువు. ఈ ధాతువు నుండి "పురుషః" అనే పదం పుట్టినప్పుడు, ఆ పదానికి, " పురుషః —అభిముఖంగా వెళుతున్నాడు— అనే అర్థం వస్తుంది. ఈ "పురుషః" అనే పదం చేతనుని నిర్దేశిస్తుంది. "పురుషం కరోతి ఇతి పురుషకారః" అనే వ్యుత్పత్తి వల్ల, లక్ష్మీదేవి జీవుని సంస్కరించి భగవంతుని అభిముఖంగా వెళ్లేటట్లుగా చేస్తున్నది— అనే అర్థం స్పష్టం అవుతున్నందున, భగవంతుని విడచి లక్ష్మీదేవి ఉండేటప్పుడు, ఆమె తన ఉపదేశంతో కానీ, తన అనుగ్రహంతో కానీ జీవుని సంస్కరించి పురుషునిగా చేస్తున్నది కనుక, చేతనునకు లక్ష్మీదేవి పురుష కారం అవుతున్నది, అంటే, పురుషకారస్వరూపిణి అవుతున్నది.

ఈ విధంగా, జీవుని, భగవంతుని, ఇద్దరినీ మార్చి, పురుషులనుగా చేసి, జీవుడు భగవంతుని ఉద్దేశించి అభిముఖంగా వెళ్లేటట్లుగాను, భగవంతుడు తనను ఆశ్రయించిన జీవుని విషయంలో క్షమ మొదలైన గుణాలతో నిండినవాడుగా, రక్షకుడుగా, నిండుగా ఇచ్చేవాడుగా, ఆ జీవుని అంగీకరించేవాడుగా చేయడం పురుషకారంగా, జీవుడు, భగవంతుడు— అనే ఇద్దరినీ కలిపే ఘటకత్వం, అంటే, ఇంతకుముందు విడిపడి ఉండే ఈ ఇద్దరినీ కలపడం— అనే అర్థం ఈ పురుషకారం అనే పదానికి అర్థమని ఏర్పడుతున్నది.

ఇదే లక్ష్మీదేవియొక్క పురుషకారమై ఉండే స్వభావం. పురుషకారః అనే పదం నిత్యపుంలింగం కనుక, లక్ష్మీదేవిని చెప్పేటప్పుడు కూడా పుంలింగపదంగానే ప్రయోగింపబడుతున్నది. ఇక, లక్ష్మీదేవి చేసే ఉపదేశంతో జీవుడు మారనప్పుడు, ఆమె తన కృపతో అతనిని సంస్కరిస్తుంది — అని చూపబడుతున్నదే! రావణునకు "మిత్ర మౌపయికం కర్తుమ్"— శ్రీరాముని నీవు స్నేహితునిగా చేసుకోవడం తగినది— అని ఉపదేశించిన ఆ ఉపదేశంతో అతని కర్మపారతంత్ర్యం ఎందుకు నశించలేదు? ఎందుకు అతడు శ్రీరాముని శరణం పొందలేదు? అనే ఒక ప్రశ్న ఇక్కడ వస్తుంది.

ఇక్కడ, విస్తృతికి భయపడకుండా, శ్రీవచనభూషణ వ్యాఖ్యానంలో తిరుమళిశై అణ్ణా అప్పంగార్ అరుంబదంలో అనుగ్రహించిన విషయాన్ని, శ్రీ పెరుంబూదూర్ ఎంబార్ జీయర్ స్వామి అరుంబదంలో అనుగ్రహించిన విషయాన్ని తెలియజేస్తాను.

శ్రీమదిత్యాది అణ్ణా అప్పంగార్ స్వామి చూపించిన విషయం ఏమంటే,

"రావణుని సీతాదేవి తన అనుగ్రహంతో సంస్కరించకపోవడం ఎందువల్ల ? అంటే, దేవతలకు రావణ వధను చేస్తానని ప్రతిజ్ఞ చేసినందువల్ల రావణుని విషయంలో అనుగ్రహాన్ని చూపించి అతనిని సంస్కరించలేదు. ఇది భగవంతుని అభిప్రాయాన్ని అనుసరించి చేసిన పని. సీతాదేవి రావణునకు ఉపదేశించినప్పటికీ, అంగదునిద్వారా రావణునకు ఉపదేశించిన భగవంతుని అభిప్రాయానుసారంగా అని భావం. " ఇది శ్రీ అణ్ణా అప్పంగార్ అరుంబదంలో ఉండే వివరణం. దీని భావం ఏమంటే—

సీతాదేవి రావణుని తన కృపతో సంస్కరించి, అతడు శ్రీరాముని ఆశ్రయించేటట్లు చేయలేదు. ఎందుకు చేయలేదు? అనేది ప్రశ్న.

దీనికి సమాధానం ఏమంటే, రావణుని చేత బాధలను పడిన దేవతల ప్రార్ధనకు అనుగుణంగా దేవతలకు "రావణుని వధిస్తాను" అని శ్రీరాముడు ఇంతకు ముందే ప్రతిజ్ఞ చేసి ఉన్నందున, సీతాదేవి తన కృపతో రావణుని సంస్కరించినట్లయితే, ఆ విధంగా సంస్కరింపబడినవాడు శ్రీరాముని శరణు పొందుతాడు, ఆ విధంగా తనను శరణు పొందినవానిని శ్రీరాముడు తప్పక అనుగ్రహించి తీరాలి. ఇంతే కాక, అతనిని వహించడం సాధ్యం కాదు. అప్పుడు శ్రీరాముడు అసత్యాన్ని పలికినవాడు అవుతాడు. అందుచేత, సీతాదేవి శ్రీరాముని అభిప్రాయాన్ని అనుసరించి, రావణుని తన కృపతో సంస్కరించలేదు. అతనికి " శ్రీరామునితో నీవు స్నేహాన్ని చేసుకో" అని ఉపదేశం చేసింది ఎందుకని? అని అంటే, శ్రీరాముడు రావణుని వధించాలని భావించినప్పటికీ, "నాతో రాయబారాన్ని చేసుకో "అని శ్రీరాముడు అంగదుని ద్వారా రావణునకు ఉపదేసం

చేశాడు. ఎందుకు? అది యుద్ధనీతి కనుక. ఆ విధంగానే, సీతాదేవి కూడా, పురుషకారం చేసేదాని క్రమం— అని శ్రీరాముని అనుసరించి, రావణునకు ఉపదేశం చేసింది" అనేది ఇక్కడ సమాధానం.

అయితే, ఈ సమాధానంలో ఒక లోటు కనిపిస్తున్నది. అది ఏమంటే—

దేవతలు, రావణుడు తమకు బాధలను కలిగించినందువల్ల "అతనిని వధించాలి" అని ప్రార్థించారే తప్ప, రావణుడు కూడా విభీషణునివలె వారితో పొసగి ఉండి, వారికి మంచిని చేసేవాడైతే, వారు దానిని అడ్డుపెట్టేవారు కాదు. అందుచేత, శ్రీరాముడు అతనిని వధించే తీరాలి— అనే విషయం లేదు. అతనిని సీతాదేవి తన కృపతో సంస్కరించి, శ్రీరామునితో చేరిస్తే, శ్రీరాముడు కూడా విభీషణుని వలె అతనిని స్వీకరించి, దేవతలతో అతడు పొసగి ఉండేటట్లు చేసి, రావణుని, రాక్షసులను ఉజ్జీవించేటట్లు చేసి ఉండవచ్చు. అందుచేత సీతాదేవి రావణుని కృపతో అనుగ్రహించకుండా, సంస్కరించకుండా ఉండడం అనేది— శ్రీరాముని అభిప్రాయానికి అనుగుణంగా— అని చెప్పడానికి వీలు కాదు కదా— అనేది ఇక్కడ ఆ లోటు.

అందుచేత, శ్రీమత్పరమహంసేత్యాది శ్రీపెరుంబూదూర్ ఎంబార్ జీయర్ స్వామి ఇంకొక విధంగా దీనికి సమాధానం అనుగ్రహించారు. దాన్ని కూడా ఇప్పుడు చూద్దాం. సీతాదేవి అనుగ్రహంతో సంస్కరించడం అంటే, రావణుని చెడ్డ బుద్ధిని తొలగేటట్లుగా అతని విషయంలో విశేషమైన కటాక్షాన్ని చేయడమే. ఆ విధంగా సీతాదేవి విశేష కటాక్షం చేసినప్పటికీ, అది ఫలించాలి అంటే, " ఈమె కటాక్షం ఫలించు గాక !" అని భగవంతుడు సంకల్పిస్తేనే అది ఫలిస్తుంది. భగవంతుడు అయితే, రావణుని సంహరించడంలోనే అభిప్రాయాన్ని కలవాడు. ఆ భగవంతునకు కల, "రావణుడు కూడా బాగుపడాలి" అనే తన అభిప్రాయానికి విరుద్ధమైన "రావణుని సంహరించాలి" అనే అభిప్రాయాన్ని మరుగుపడేటట్లుగా చేయాలి. తనను విడచి ఉన్న సమయంనుండి ఆరంభించి, రాత్రి పగలు అనే తేడా లేకుండా, నిరంతరంగా మిక్కిలిగా బాధపడుతూ

ఉండే భగవంతుని తాను సమీపించి, తన ఉపదేశంతో కాని, తన అందంతో కానీ, వశం చేసుకొంటే తప్ప, ఆ విధంగా భగవంతుని సంకల్పాన్ని మరుగు పరచడానికి సాధ్యం కాదు. ఇది చేయడానికి సాధ్యం కాని విధంగా రావణుడు తనను భగవంతునకు దూరం చేసినందున, అంటే, తనను శ్రీరామునకు దూరంచేసినందున, సీతాదేవి అతనిని తన కృపతో సంస్కరించలేదు

ఇంకొక కారణం కూడా ఉన్నది. ఈ అవతారంలో, రావణుడు శత్రువు కనుక, అతనిని సంహరించవలసిన నిర్బంధం శ్రీరామునకు ఉన్నది. భగవంతుని ఆ అభిప్రాయానికి మారుగా కృపతో తనకు సంస్కరించే శక్తి ఉన్నప్పటికీ, భగవంతుని అభిప్రాయాన్ని అనుసరించవలసిన తన పారతంత్ర్యం కారణంగా సీతాదేవి రావణుని తన కృపతో సంస్కరించలేదు.

ఈ అవతారంలో, రావణుని శత్రువుగానే భావించవలసిన నిర్బంధంలో ఏమున్నది? అని అంటే, వినండి. పాలసముద్రం మధ్యలో శ్వేతద్వీపం అనే ఒక పెద్ద ద్వీపం ఉన్నది. అందులో భగవంతునకు ఒక ఆలయం ఉన్న. ది అందులో, ఆదిశేషుని పైన, లక్ష్మీదేవి తన పాదాలను సంవాహనం చేయగా, భగవంతుడు వేంచేసి ఉన్నాడు. జయుడు, విజయుడు అనే పరమపదంలో ఉండే ద్వారపాలకులు ఇంకొక రూపాన్ని ధరించి ఇక్కడకు వచ్చి, భగవంతుని ఆలయం వాకిటిలో " నాయకనాయ్ నిన్ట" అనే విధంగా కాపలా కాస్తున్నారు. ఈ స్థితిలో, ఈ ప్రకృతి మండలంనుండి విడిపడకుండా, విడిపడిన ముక్తుల వలె ఈ ప్రకృతి ప్రాకృతాలలో ఆశ లేనివారై ఉంటారు– శుద్ధసత్వమే తల ఎత్తిన సనక సనందనాదిమునులు వారికి సాక్షాత్కారాన్ని ఇవ్వడం కోసం ఆ విధంగా భగవంతుడు శ్వేతద్వీపంలో ఉంటాడు. ఈ శ్వేతద్వీపంలో సనకుడు మొదలైన మునులు, వారు భావించినప్పుడు పోయి, భగవంతుని సేవించి వస్తారు.

ఆ శ్వేతద్వీపంలో ఉండే భగవంతునకు ఒకానొక సమయం శౌర్యం అనే ఒక గుణం తల ఎత్తి, దాని మూలంగా అతని భుజాలలో తిమ్మిరి ఏర్పడింది. ఆ తిమ్మిరి

తీరేటట్లు తనతో యుద్ధం చేసి, తనను ఆనందింప చేయడం కోసం సమర్థులుగా ఉండేవారు ఎవరు? అని అతడు గమనించి చూశాడు. తన ఆలయంలో కాపలా కాస్తున్న జయ విజయులు తప్ప, వేరే ఎవరు కూడా తనతో యుద్ధం చేయడానికి తగిన యోగ్యత కలిగినవారు కాదు. వారిని యుద్ధానికి పిలిస్తే, వారు తన తిరుమే ప్రేమను కలిగిన వారు కనుక, తనతో యుద్ధం చేయడానికి అంగీకరించరు. ఏమి చెయ్యాలి? అని భగవంతుడు ఆలోచించాడు. అప్పుడు ఆ స్వామికి ఒక దారి కనిపించింది. అది ఏమంటే— జయ విజయులకు కూడా కూడా అనుభవించే తీరవలసిన భాగవతాపచారాన్ని కలిగించి, దాని మూలంగా వారికి తనతో యుద్ధం చేయడానికి ఉపయోగపడే శౌర్యం, వీర్యం— అనే రెండు గుణాలు తప్ప, మిగిలినవి మరగుపడేటట్లుగా చేసి, వారిని భూమిలో జన్మించేటట్లు చేసి, తాను కూడా భూమిలో అవతరించి, ఆ అవతారాలలో తనను వారు ఎదిరించేటట్లుగా చేసి, వారితో యుద్ధం చేసి, ఆనందాన్ని అనుభవించవచ్చు —అనేదే ఆ స్వామికి తోచిన అభిప్రాయం.

దానికి కారణం చెబుతాను. అది ఏమి? అంటే, శ్వేతద్వీపంలో ఆదిశేషుని పైన లక్ష్మీదేవితో పాటు వేంచేసి ఉండే భగవంతునకు ఒకనాడు లక్ష్మీదేవితో ఏదో వాదం ఏర్పడింది. ఆమె కోపించి అక్కడనుండి లేచి వెళ్లిపోయేటట్లుగా భగవంతుడు చేశాడు. అయితే, ఆ విధంగా లక్ష్మీదేవి వెళ్ళిపోయిన తరువాత అతడు విశ్లేషంలో చాలా బాధపడేవాడై, జయ విజయలను పిలిచి, " నాకు మనసు బాగాలేదు. అందువల్ల ఎవరినీ లోపలకు అనుమతించవద్దు. " అని నియమించాడు. వారు కూడా, ఆ విధంగానే ద్వారం దగ్గర కాపలా కాస్తూ ఉన్నారు. ఆ సమయంలో, అలవాటు ప్రకారం, ఎప్పటివలె వచ్చే బ్రహ్మపుత్రులైన సనకాదిమునులు నలుగురు భగవంతుని సేవించడం కోసం అక్కడకు వచ్చారు. జయ విజయులు వారిని లోపలకు వెళ్ళనీయకుండా అడ్డుకున్నారు. అప్పుడు ఆ మునులు కూడా వెంటనే కోపంతో జయవిజయలను "మీరు జ్ఞానానికి లోటును కలిగించే భూలోకంలో పుట్టండి" అని వారిని శపించారు. వెంటనే జయ విజయులు చాలా భయపడ్డారు. శాపమిచ్చిన మునులు కూడా

సత్త్వగుణమే తల ఎత్తిన తమకు, భగవంతుని సన్నిధిలో, అందులోనూ, భగవంతునకు రక్షకులైన జయ విజయుల విషయంలో, వారిని పురస్కరించుకునే లోపలకు ప్రవేశించవలసినది క్రమమై ఉండగా, వారిని తాము ఆ విధంగా కఠినంగా శపించేటట్లు ఏ విధంగా తమకు రజోగుణం తల ఎత్తింది? అని చాలా బాధ పడ్డారు. భగవంతునకు దూరమైన లక్ష్మీదేవి కూడా "నేను కొంతకాలం భగవంతునకు దూరమైనందువల్ల కదా, ఈ విధంగా ఏర్పడింది!" అని చాలా బాధపడి, దానికి తగిన పరిహారాన్ని అన్వేషించడం కోసం వేగంగా వచ్చింది. భగవంతుడు కూడా ఆమెకు ముందే బయటకు వచ్చి, భయంతో నిలచి ఉండే జయవిజయులను, సనకాదిమునులను చూచి, " ఇది అంతా నా అభిప్రాయం ప్రకారమే జరిగింది. నా సంకల్పమే దీనికి కారణం. ఓ మునులారా! మిమ్ములను లోపలకు విడవకుండా అడ్డు పెట్టమని చెప్పినవాడను నేనే. మీకు తెలియకుండా జయవిజయులను మిమ్ములను శపించేటట్లుగా చేసినవాడను నేనే. వీరితో యుద్ధం చేసి ఆనందాన్ని అనుభవించడం కోసంగా నేను ఆలోచించిన మార్గం, ఇది. అందుచేత, ఈ జయ విజయులు మూడు జన్మలలో నాకు శత్రువులుగా భూలోకంలో పుట్టి, శౌర్యం వీర్యం తప్ప, మిగిలిన అన్ని గొప్పతనాలను మరచిపోయి, నన్ను ఎదిరించి నన్ను ఆనందింప చేస్తారు. వారితో మూడు జన్మలలో క్రమంగా అనంతుని, లక్ష్మీదేవిని, సుదర్శనుని పురస్కరించుకొని వారికి శాప విమోచనాన్ని కలిగిస్తాను. ఎవ్వరూ బాధపడకండి" అని అన్నాడు. ఇందువల్ల ప్రహ్లాదాళ్వాన్ ఆదిశేషుని అవతార విశేషం అనేది కూడా తెలియ వస్తున్నది.

జయ విజయుల మొదటి జన్మ ఏమి? అంటే, హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు అనే రూపాలలో వారు జన్మించారు. ఆ జన్మలో భగవంతుడు మహావరాహంగా రూపాన్ని ధరించి, భూదేవిని నీటిలో ముంచి దాచిన హిరణ్యాక్షునితోనూ, నరసింహావతారాన్ని ఎత్తి, ప్రహ్లాదుని హింసించిన హిరణ్యకశిపునితోనూ యుద్ధం చేసి, ఆనందాన్ని అనుభవించి, వారిని ఆ జన్మను తీర్చాడు. వారికి కలిగిన ఇంకొక జన్మ అయిన రావణ కుంభకర్ణులలతో దశరథ చక్రవర్తికి

కుమారుడై అవతరించి, సీతాపహారాన్ని నెపంగా చేసుకొని, వారితో యుద్ధం చేసి ఆనందాన్ని అనుభవించి, వారి ఆ జన్మను తీర్చాడు. వారి మూడవ జన్మ శిశుపాలుడు, దంత వక్త్రుడు అనేది. భగవంతుడు శ్రీకృష్ణుడుగా అవతరించి, శిశుపాలుని ధర్మపుత్రుని రాజసూయ యాగంలో సుదర్శనంతోను, దంత వక్త్రుని శ్యమంతకమణిని దొంగిలించి పరుగెత్తి వెళ్ళినప్పుడు అతనిని వెంబడించి వెళ్ళి, సుదర్శనచక్రంతోను వధించి, వారికి కలిగిన ఆ జన్మను తీర్చాడు. వారికి ఏర్పడిన శాపాన్ని పోగొట్టాడు. అందుచేత భగవంతుడు శ్రీరాముడై పుట్టడం రావణునితో యుద్ధం చేసి ఆనందాన్ని అనుభవించడం కోసమే కనుక, సీతాదేవి భగవంతుని ఈ స్థితిని తెలిసికొన్నది కనుక, రావణుని తన కృపతో మార్చలేదు.

అయితే, సంస్కరించటానికి సాధ్యం కాని, సంస్కరించ నక్కరలేని, ఏ మాత్రం మారని రావణునకు సీతాదేవి హితోపదేశం ఎందుకు చేసింది? అని అంటే, ఇతరులు పడే దుఃఖాన్ని చూచి సహించలేని సీతాదేవి చాలా గొప్పవి అయిన చిత్తు, ఆచిత్తు, ఈశ్వరుడు— అనే మూడు తత్త్వాలను కబళీకరించే విధంగా ఉండే తన జ్ఞానం కూడా పూర్తిగా కలుషితమై, "ఇది చెయ్యాలి, ఇది చేయదగినది" అనే విషయాన్ని తెలియనీయకుండా చేసే శీలగుణాన్ని కలిగినది కనుక, రావణుని చెడ్డ పనితో ఒక దేశం అంతా కూడా పాడైపోవడన్ని చూసి బాధపడి, బాధలో తట్టుకోలేక, తనను కూడా మరచిపోయి, రావణునకు ఆ విధంగా ఉపదేశించింది.

అయితే, ఈ విధంగా మనసులో కలత చెంది, తనను తాను మరచిపోయి, రావణుకు ఉపదేశించడాన్ని, లక్ష్మీదేవి జీవుని తన ఉపదేశంతో సంస్కరిస్తుంది— అనేదానికి ఉదాహరణంగా చూపవచ్చునా? అని అంటే, " ఉపదేశం చేయడానికి తగిన యోగ్యతను ఏ మాత్రం లేని రావణునకు కూడా ఉపదేశించడాన్ని చూస్తే, ఉపదేశాన్ని చేయడానికి తగిన యోగ్యత కలిగినవారి విషయంలో ఉపదేశం చేసి, దానిమూలంగా

ఈమె జీవులను మారుస్తుంది— అనేది ఆలా స్పష్టం అవుతున్నందున, ఈ రావణునకు ఉపదేశించిన సందర్భాన్ని ఉదాహరణంగా చెప్పవచ్చు.

"సీతాదేవి రావణుని కూడా ఉపదేశంతో మారనప్పుడు, దయతో సంస్కరిస్తుంది" అనేదానిని పురస్కరించుకునే సమాధానం చెప్పబడుతున్నది.

కాకాసురుడు "మలరాళ్ తనత్తుళ్ళాన్" ( లక్ష్మీదేవి వక్షస్సులో భగవానుడు అధివసించి ఉంటాడు) అనే విధంగా భగవంతునకు చాలా భోగ్యమైన లక్ష్మీదేవి వక్షఃస్థలాన్ని తన ముక్కుతో గుచ్చి గాయపరచినందున, అతడి పై దయను మరచి, చాలా కోపాన్ని పొంది, " కేవలం ఇది ఒక కాకే కదా" అని చూడకుండా, అస్త్రాలలో చాలా గొప్పది అయిన బ్రహ్మాస్త్రాన్ని శ్రీరాముడు ప్రయోగించాడు. అయితే, ఆ అస్త్రం వెంటనే అతని తలను ఖండించకుండా, అతడు ఆశ్రయాన్ని వెతకుతూ వెళ్లిన చోటుకు అంతటికి (ఆచార్యుని శిష్యుడు వెంబడించినట్లుగా) అతనిని వెంబడిస్తూ వెడుతున్నదే! ఇది ఏమి? ఎందువల్ల? అంటే, శ్రీరాముని క్రోధానికి లక్ష్యం అయిన కాకాసురుని దుర్గతిని గమనించిన సీతాదేవి, అతడు తన వక్షస్సులో గుచ్చి కలిగించిన బాధను, బిడ్డ తన దగ్గర పాలను తాగేటప్పుడు పళ్ళతో కరిస్తే ఆ బిడ్డను తల్లి సహించినట్లుగా, సహించి, "ఆ అల్పమైన అపరాధానికి బ్రహ్మాస్త్రాన్ని విడువడమా! ఇదేమి దయలేని స్వభావం?" అని భావించి, తన కటాక్షంతో బ్రహ్మాస్త్రాన్ని కాకాసురుని తలను ఖండించకుండా, అతనిని వెంబడించేటట్లుగా నియమించింది. అది కూడా, అంటే, ఆ బ్రహ్మాస్త్రం కూడా, కాకాసురుని వెంబడించింది. భయపడిన కాకాసురుడు తనకు తగిన ఆశ్రయాన్ని వెదకుతూ, ముల్లోకాలలోనూ అనేక పర్యాయాలు చుట్టి తిరిగాడు. అయినా, ఎక్కడ ఆశ్రయాన్ని పొందలేక పోయాడు. అందువల్ల ఆకించన్యం, అనన్యగతిత్వం అనే స్థితులను కలిగినవాడై, శ్రీరాముని సమక్షంలోకి వచ్చి పడ్డాడు. ఇది కాకాసురునకు కలిగిన ఏమీ చేయలేని స్థితి. ఇక్కడ కాకాసురుని సీతాదేవి అనుగ్రహంతో సంస్కరించడం ఏమంటే, బ్రహ్మాస్త్రం సీతాదేవి ఆజ్ఞతో అతని తలను ఖండించకుండా,

ఊరికే అతనిని భయపెడుతూ వెంబడించి వెళ్ళేటట్టుగా చేసి, అతనిని శ్రీరాముని ఆశ్రయించేటట్లుగా చేయడమే. ఆ విధంగానే, సీతాదేవి రావణుని కూడా తన కృపతో సంస్కరించింది. ఏ విధంగా?అంటే, లంకలో మొదటి రోజు యుద్ధంలో శ్రీరాముని ఎదిరించి యుద్ధం చేసిన రావణుడు రామ బాణాల తాకిడికి చాలా గాయపడినవాడై, చాలా బాధపడ్డాడు. చేతిలో ఉండే విల్లును పారవేసి, కేవలం రిక్తహస్తుడై భూమిపై నిలబడ్డాడు శ్రీరాముడు అప్పుడే అతని తలను నరుకకుండా, అతని నిశ్చేష్టతను గమనించి, " ఈ నాడు ఇంటికి పోయి, రేపు రా" అని పంపించి వేశాడు. అతడు కూడా శ్రీరాముని అనుమతిని పొంది కాలినడకతోనే లంకలోకి వెళ్ళాడు— అనేది చరిత్ర. శ్రీరామునకు ఓడిపోయిన రావణుడు వెంటనే తన మాయాబలంతో వేగంగా లంకకు వెళ్లాలి తప్ప, ఏ ఆశయం లేనివాని వలె "శ్రీరాముడు చేసేది, చేయదలచుకున్న ది చేయనీ!" అనే విధంగా పారతంత్ర్యం స్ఫురించేటట్లుగా ఎందుకు నిలచాడు? అని అంటే, ఇంతకుముందు, తనను గొప్ప వీరునిగా భావించి శ్రీరాముని లెక్కపెట్టకుండా, రావణుడు ఎదిరించాడు. శ్రీరాముడు, తాను పూర్వం విశ్వామిత్రుని దగ్గర ఉపదేశక్రమంలో పొందినవి తనకు అధీనంలో ఉండేవి అయిన అస్త్రాలను రావణునిపై ప్రయోగించాడు. ఆ అస్త్రాలు, శ్రీరాముడువలె, దివ్యపత్నులు అయిన లక్ష్మీదేవి భూదేవి నియోగించగా, నిత్యసూరులు, బ్రహ్మాది దేవతలు లక్ష్మీదేవికి కూడా కైంకర్యాన్ని చేసేవారు కనుక, ఆ అస్త్రాలను లక్ష్మీదేవి ఈ విధంగా నియమించినదట. " మీరు శ్రీరామునిచే రావణునిపై ప్రయోగించినప్పుడు, మీరు అతనికి భయాన్ని కలిగించి, ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిని కలిగినపుడు అతడు శ్రీరాముని ఎదిరించి నిలచే స్థితి నుండి తప్పించండి" అని నియమించిందట. రావణుని శరీరంపై పడిన ఆస్త్రాలు కూడా అతనిని చంపకుండా, సీతాదేవి ఇచ్చిన ఆజ్ఞానుసారంగా అతనికి భయాన్ని కలిగించి, అతడు ఏమి చేయలేని స్థితిని పొందేటట్లుగా చేసినవట. అందుచేతనే, రావణుడు కూడా తన ధైర్యాన్ని అంతటినీ కోల్పోయి, చేతిలో ఉండే వింటిని పారవేసి ఏమి చేయలేని స్థితిని పొంది శ్రీరాముని ఆజ్ఞను ఎదురుచూస్తూ నిలబడ్డాడట. ఆ స్థితి సీతాదేవి యొక్క కటాక్షం చేత

ఏర్పడినందున, ఈ విధంగా అతనిని కూడా తన కృపతో సీతాదేవి అనుగ్రహించింది— అని చెప్పవచ్చు. అందుచేతనే కాకాసురునకు వలె, ఇతనికి కూడా ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి ఏర్పడినది. " భగవంతుడు తనను రక్షించే ప్రయత్నాన్ని అడ్డుకునే తన ప్రయత్నం నుండి జీవుడు నివర్తించడమే ప్రపత్తి" అని ప్రపత్తి లక్షణం చెప్పబడింది కనుక, ఈ ప్రపత్తి కాకాసురుడు రావణుడు అనే ఇద్దరికీ సమన్వయిస్తుంది.

అయితే, మఱి, ఎందుకు కాకాసురుని శ్రీరాముడు అనుగ్రహించి రక్షించినట్లుగా, రావణుని స్వీకరించి రక్షించలేదు? అని అంటే,

కాకాసురుడు ఏమీ చేయలేని స్థితిని పొంది, వచ్చి భూమిపై పడినప్పుడు, శ్రీరాముని దగ్గర ఉండే సీతాదేవి, జనక చక్రవర్తికి పుట్టినందున ఏర్పడిన తన జన్మ మహిమ వల్ల, శ్రీరామునకు పత్ని అయిన క్రమంలోనూ, శ్రీరాముని తన మాట ప్రకారం నడుచుకునేటట్లుగా చేసి, "నీకు స్వామిత్వం, కారుణ్యం అనే రెండు గుణాలు ఉన్నాయి. — అనే పేరును పొందాలని అనుకున్నావా? అయితే, నీవు చేసే మంచిని అడ్డుకోకుండా ఉండే రీతిలో, నీ దగ్గర నీ అనుగ్రహాన్ని కోరుతూ నీ ముందు పడిన ఇతనిని, ఇతని అభిప్రాయం మారడానికి ముందే, నీవు కటాక్షించాలి" అని చాలా దయతో "ఇతనిని నీవు రక్షించాలి, ఇతనిని నీవు రక్షించాలి" అని శ్రీరాముని ప్రేరేపించి, కాకాసురుని తలను ఖండించాలని ప్రయోగించిన, అతనిని వెంబడించిన బ్రహ్మాస్త్రానికి కూడా ఒక లోటును, అంటే, కాకాసురుని తలను ఖండించకుండా, అతని ఒక కంటిని మాత్రం పోగొట్టడానికి దానిని సాధనంగా చేసిన ఒక కొరతను, కలిగించి, కాకాసురునకు ఒకే కన్ను రెండు కళ్ళు చేసే కార్యాన్ని చేసేటట్లుగా కూడా శ్రీరాముని ద్వారా చేసి, ఏ కొరతా లేకుండా రక్షించింది.

రావణుని విషయంలో, దేవతాకాంతల చెరలోని బంధాలు తన కాలిలో ఏర్పడేటట్లు చేసుకున్నందువల్ల సీతాదేవి శ్రీరాముని సమీపంలో ఉండలేకపోయింది. శ్రీరాముడు కూడా ఈమె విశ్లేషంతో కలత చెంది ఉన్నందున, రావణుని అనుగ్రహించి

రక్షించకుండా, "ఇతని నిస్సహాయ స్థితికి ప్రయోజనం– ఇప్పుడే ఇతనిని తలను ఖండించకుండా సరిపోతుంది"– అని భావించి, "గచ్ఛ అనుజానామి" ( అనుమతిని ఇస్తున్నాను, వెళ్లిరా) అని విడచి పెట్టాడు. అందువల్లనే "శ్రీరాముని వల్ల రావణుడు అంగీకరింపబడడం" అనే ప్రయోజనం సిద్ధించకుండా పోయింది. అందుకే, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడి గ్రంథంలో " ఇవళ్ సన్నిధియాలే కాకమ్ తలై పెఱ్ఱదు, అదు ఇల్లామైయాలే రావణన్ ముడిందాన్" ( సీతాదేవి సన్నిధి కారణంగా కాకాసురుడు బ్రతికి బయటపడ్డాడు, అది లేనందువల్ల రావణుడు మరణించాడు) ( 135 ) అని అనుగ్రహించారు. అందుచేత, శ్రీరామావతారంలో పురుషకారానికి పట్టాభిషేకం చేసికొన్న సీతాదేవి భగవంతుని విడచి ఉన్నప్పుడు, " రావణుని వధించి తీరాలి" అని నిశ్చయాన్ని కల భగవంతుని మనసును తన అందంతో మార్చడం సాధ్యం కాలేదు కనుక, కాకాసురుని వలె రావణుడు కూడా నిస్సహాయ స్థితిని పొందినప్పటికీ, పొందవలసిన ప్రయోజనాన్ని అతడు పొందడానికి అవకాశం లేకుండా పోయింది – అని గమనించాలి.